

*Chandamama, September '48* *Photo by: B. Ranganadhan*

నేను ఊడుస్తున్నా !




## భూమినుండి సంపద

# అభ్రకము



అభ్రకము అనాదినుండియు ఔషధ ప్రయోజనములకు వాడబడుతూ యుండేది. కాని ఇటీవలనే ఇది పరిశ్రమలకు చాల ఉపయోగకారియని గ్రహించబడినది. పత్రములాంటి మైకా కొలిముల కిటికీలకు, గ్యాస్ లాంతర్లకు చిమ్నీగాను, విద్యుచ్ఛక్తి తగులకుండా చేయుటకు వాడబడుచున్నది. విద్యుచ్ఛక్తి ఎక్కువ ఎక్కువగా ఉపయోగించబడుచున్న ఇండియా దేశములో అభ్రకమునకు గొప్ప భవిష్యత్తుకలదు.

అభ్రకపు పరిశ్రమలో నేడు చిన్నచిన్న అభ్రకపు తుంపులు వ్యర్థమగుటలేదు. కారణమేమంటే వాటిని లక్కతో అతికించి సారాయిలో ముంచితే తరువాత ఏ ఆకారములోనైనా తయారు చేయవచ్చును. అభ్రకపు పొడికి రంగునిచ్చేశక్తి యుండుటచే అది చిత్రమగు రంగులను తయారుచేయుటకు వాడబడుచున్నది.




లక్క వ్యాపారము ఇండియాకే పూర్తిగా చెందినది. కావున ఇండియాలోకెల్ల 95% అభ్రకపు ఉత్పత్తిగల బీహారులో అభ్రకపు పరిశ్రమను అభివృద్ధిచేయుట చాల లాభకరము.

మరునటి నెలలో
మరియొకదానికై
వేచియుండుడు.

ప్రకటనదారులు : హమాం & 501 సబ్బులను తయారు చేయు

## ది తాతా ఆయిల్ మిల్స్ కంపెనీ లిమిటెడ్

# చందమామ

ఈ సంచికలో యివి

చదువుకోండి



ఇవన్నీగాక చిక్కుచదరాలు, ముగ్గులు, చిక్కుబొమ్మలు, పొడుపు పద్యాలు, పజిలు, ఇంకా ఇంకా ఎన్నో వున్నై

**చందమామ ఆఫీసు**

పోస్టుబాక్సు నెంబరు. 1686

మద్రాసు. 1.




సంచాలకుడు, చక్రపాణి

సంపుటి 3 | సెప్టెంబరు 1948 | సంచిక 3

# విఘ్నేశ్వర ప్రార్థన

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్,
ప్రసన్నవదనం ధ్యాయే త్సర్వవిఘ్నోప శాంతయే.

తుండము నేకదంతమును తోరపుబొజ్జయు వామహస్తమున్
మెండుగ మ్రోయుగజ్జెలును మెల్లనిచూపుల మందహాసమున్
కొండొక గుజ్జురూపమున కోరినవిద్యలకెల్ల నొజ్జయై
యుండెడు పార్వతీ తనయ ఓయి గణాధిప నీకు మ్రొక్కెదన్.



విఘ్నేశ్వర పూజ




ఇంగిలీసు మాస్టరు గా రొకమా
రెక్షాట్రి క్లాసుకు వచ్చాడు
తెలుగు టెక్స్టునటునిటు త్రిప్పుచునొక
తిప్పకాయ ని ట్లడిగాడు.

పంతులు :

'మనుచరిత్ర వ్రాసిన దెవరబ్బాయ్?'

అబ్బాయి :

'మల్లసాని వ్రాసాడండీ!'

పంతులు :

'సిట్ డౌ నేడ్చా' వంటుండగనే

అబ్బాయి :

'శ్రీనాథుడు వ్రాసా' డనియెన్.

పంతులు కా దని పండ్లు గొఱకగా
బాలుడు పకపక లాడాడు.
మాస్టరు కుక్రోశము రాగా హె
డ్మాస్టరు కెక్కులు చెప్పాడు.

హెడ్మాస్టరు గా రసిస్టెంటుతో
ఈలా సంభాషించాడు:
'పిల్లవెధవ మాటల కేమందోయ్?
తల్లక్రిందుగా చెప్తారు.
ఆ టైటలు పేజీపై వావి
ళ్ళందు సన్సు వా రని ఉంటే
"శ్రీనాథుడు మలసా"నని చెపటం
చిత్రంగానే ఉందండీ?
ఏటికినవుతా' రంటూ క్లాసుకు
నోటీసును బంపించాడు.

శాస్త్రులు 'దొందూ
దొంద'ని నవ్వుచు
సంతకమును బె
ట్టంపాడు.

రచన: 'ఏటుకూరి'


భారత
స్వాతంత్ర్య శిశువు
ప్రాయం ఒక ఏడాది


15 ఆగస్టు
1947
పట్టాభిషేకం


కాశ్మీర్ సమస్య


మహాత్ముని చావు


హైదరాబాదు


కమ్యూనిష్టుల కల్లోలం


శరణాగతుల
సమస్య


చీకటి బజారు


కాగితాలు లేవు


అన్నం లేదు
గుడ్డ లేదు
ఇళ్లు లేవు


అయినా యాత్ర సాగవలసిందే

# ధర్మసందేహము

పూర్వం ఒకగ్రామంలో ఒక గురువు ఇద్దరు శిష్యులు వుండేవారు. ఒకసారి గురువుగారు తన శిష్యులతో సహా అప్రక్క గ్రామానికి బయలుదేరారు.

కొంతదూరం వచ్చేసరికి గురువుగారికి దాహంవేసింది. ఆ చుట్టుప్రక్కల చూస్తే ఎక్కడా నీటి చుక్క కనిపించలేదు. కాని, ఆ దగ్గర్లోనే ఒక చిన్నవూరు కనిపించింది. గురువుగారు తనశిష్యులలో ఒకణ్ణి పిలిచి, "శిష్యా చాలాదాహంగా వుంది. కాస్త దాహం తీర్చుకునిగాని బయలుదేరలేను. నువ్వు ఆ కనపడే వూళ్లోకిపోయి ఎవరినైనా అడిగి కాసిని చల్ల చుక్క పట్టుకురా. నువ్వువచ్చేదాకామేము ఈచెట్టు క్రింద విశ్రాంతి తీసుకుంటాం" అన్నారు.

శిష్యుడు సరేనని బయలుదేరి ఆ వూళ్లో ఒక ధనవంతుని ఇంటికివెళ్లి తమ గురువుగారు దాహంకోరినసంగతి చెప్పి కాసిని చల్ల యివ్వమని అడిగాడు. ఇంటి యజమాని 'సరే అలాగే యిస్తాను వుండండి.' అని లోపలికి పోయాడు.

ఇంతలో శిష్యుడికళ్లు అక్కడే వున్న పశువులకొట్టంపై పడ్డాయి. కొట్టంలో ఒక గేదెకు బారెడేసి కొమ్ములు వున్నై. అప్పుడు శిష్యుడికి ఒక ధర్మసందేహం కలిగింది.

"అరెరే, ఈ గేదెకి ఇంతపొడుగుకొమ్ములున్నయ్యే! ఒకవేళ యిది చస్తే దీన్ని ఇంట్లోంచి బయటికిలాగటమెలాగా?" అని.

శిష్యుడు యిలా ఆలోచిస్తుండగా ఇంటి యజమాని చల్ల తీసుకొచ్చాడు. ఆయన్ని చూడగానే శిష్యుడు చల్ల తీసుకోకుండానే, "ఏమండీ! మీ గేదెకి యింత బారాటికొమ్ము లున్నయ్యే! ఒకవేళ ఇది చస్తే దీన్ని బయటికి ఎలాఈడుస్తారండీ?" అని అడిగాడు.

ఇది వినేసరికి ఇంటియజమానికి చాల కోపం వచ్చింది. "చాలు చాల్లేవయ్యా. చల్లకని వచ్చినవాడివి నీ పని నువ్వు

జె. రామచంద్రన్, మద్రాసు



చూసుకుపోక నా గేదె చస్తుందని అశుభం పలుకుతావా? నీకు చల్ల యివ్వను ఫో" అని వెనక్కి తిరిగి చూడకుండా యింట్లోకి పోయాడు.

శిష్యుడు తెల్లమొహం వేసుకొని వట్టి చేతుల్తో గురువుగారి దగ్గిరికి తిరిగొచ్చి, జరిగినదంతా చెప్పకుండా, "ఈ వూళ్లో ఎవరూ చల్ల యివ్వం అన్నారు" అని చెప్పాడు. అప్పుడు గురువుగారు తన రెండో శిష్యుణ్ణి పిలిచి, "ఒరే నువ్వన్నాపోయి సాధించుకురారా. దాహం మరీ ఎక్కువవుతోంది" అన్నారు.

రెండోశిష్యుడు కూడా బయలుదేరి అదే యింటికివచ్చి చల్ల అడిగాడు.

అప్పుడు యింటియజమాని, అంతకు ముందే ఒకతనువచ్చి చల్లఅడిగినసంగతీ, తర్వాత తన గేదె చస్తుందేమోనని అశుభం పలికిన సంగతీ చెప్పాడు. అంతా విని, చివరికి ఈ శిష్యుడు"వాడిమొహం, వాడికేం తెలుసు! గేదె చస్తేనేం? దానికొమ్ములు రెండూ నరికి పారేస్తే తేలికగా బయటికి లాగెయ్యవచ్చు" అన్నాడు తన బుర్రలో వున్న తెలివినంతా ఉపయోగించి.

ఇది వినేసరికి యింటియజమానికి అరికాలి మంట నెత్తికెక్కింది. "ఏమయ్యా, నువ్వూ ఘనుడివేనే! ఏమోఅనుకున్నాను. మొదటవచ్చిన అతను గేదె చస్తుందేమో అనిమాత్రం అనేసి వూరుకున్నాడు. నువ్వు



గేదె చావటం, కొమ్ములుకోసి పారెయ్యటం కూడా అనేశావా? పో, పో, నీకు చల్ల యివ్వను" అన్నాడు. శిష్యుడు చేసేదిలేక వట్టిచేతుల్తో గురువుగారి దగ్గిరికి వచ్చాడు.

అప్పుడు గురువుగారు తనమూడోశిష్యుణ్ణి పిలిచి "ఇక నువ్వన్నా నిర్వాకం చేసుకురా. నీ వల్లా కాకపోతే అప్పుడు యిక నేనే పోతాను" అని పంపాడు.

మూడోశిష్యుడు కూడా అదే యింటికి వచ్చి చల్ల అడిగాడు. అప్పుడు యింటి యజమాని అంతకుముందు యిద్దరు వచ్చి యిలాగే చల్ల అడిగి, మొదటి అతను అశుభం పలికిన సంగతీ, రెండో అతను అంతకంటే అశుభంగా మాట్లాడినసంగతీ



చెప్పాడు. అంతా విని, శిష్యుడు, " వాళ్ళ మొహం, వాళ్ళకి ఆ మాత్రం తెలివితేటలు వుంటే యింకేం! గేదె చస్తేనేం? దాని తల వరకూ నరికివేస్తే, తలవేరే మొండెం వేరే బయటికి తేలికగా చేర్చవచ్చు" అన్నాడు.

ఇది వినేసరికి యింటియజమానికి ఒళ్లు మండిపోయింది. " ఇక కట్టిపెట్టవయ్యా. ఇంకా ఏదో చెప్పొచ్చా వనుకున్నాను. నీ కంటె వాళ్లేనయమనిపించారు. నడు, నడు. వచ్చినదారినే పో. నీకు చల్ల యివ్వను" అన్నాడు.

ఈ శిష్యుడుకూడా వట్టి చేతుల్తో తిరి గొచ్చే సరికి గురువుగారికి చాల చిన్నతన మైంది. వాళ్ళ అప్రయోజకత్వం తనకే తలవంపులని అనుకున్నాడు. " అయినా కాస్త చల్లచుక్క ఇవ్వడానికి ఎవరికీ దయ కలగకపోవడానికి కారణ మేమై ఉంటుందా ?" అని ఆలోచిస్తూ — "సరే, ఏంజేస్తాను ? నేనేపోయి ముష్టెత్తుతాను. నేను వచ్చేవరకూ యిక్కడ వుండండి" అని ముగ్గురు శిష్యుల్నీ చెట్టుకింద వదిలి పెట్టి గురువు కూడా బయలుదేరి అదే ఇంటికి వచ్చాడు.

ఇంటియజమాని గురువుగారితో అంతకు ముందు వచ్చిన ముగ్గురి సంగతీ, వాళ్ళు ఒక్కొక్కరు ఎలా అశుభం పలికిందీ చెప్పాడు. అంతా విని, గురువుగారు ఇలా అన్నారు: "వాళ్లతెలివి తెల్లారినట్టే ఉంది. ఈపాటి స్వల్పవిషయానికి పెద్ద ఆలోచన కావాలా. గేదె చచ్చిందే అనుకోండి. ఆ చచ్చినచోటనే ఒక పెద్ద గొయ్యి తీసి దాంట్లో గేదెనిపూడ్చి పెట్టవచ్చునుగదా!"

ఇది వింటుంటే యింటి యజమానికి గురువుగారిని అపళాన నమిలిమింగేద్దామా అన్నంత కోపంవచ్చింది. ఆమూల నున్న దుడ్డుకర్ర తీసుకొని "చాలు చాల్లేవయ్యా, ఇక అట్టే వాగావంటే నీప్రాణం దక్కదు. నీ కంటె ఆ ముగ్గురే నయమనిపించారే. పో, ఇంకా మజ్జిగఅడగవచ్చావా సిగ్గులేక" అంటూ గురువు వెంబడి పడ్డాడు. గురువు వెనక్కితిరిగి చూడకుండా కాలికి బుద్ధి చెప్పి శిష్యులదగ్గిరికి చేరుకున్నాడు.

ఇక ఒక్కక్షణం కూడా అక్కడవుంటే తమ ప్రాణాలు దక్కవని, నాలుక పిడచ కట్టుకు పోతున్నా, గురువు శిష్యులతోసహా అక్కడినించి మకాం ఎత్తేశాడు.






పూర్వం పాటలీపుత్రాన్ని విక్రమసింహుడనే రాజు పాలించేవాడు. అతడు ప్రజలను దయతో చూడటంవల్ల ప్రజలకు అతనంటే ఎంతో గౌరవం ఉండేది. అతనికి ముగ్గురు కొడుకు లున్నారు. ఒక కూతురు కూడా ఉంది. పెద్ద కొమారుని పేరు శూరసేనుడు. రెండవవాని పేరు ఖారవేలుడు. మూడవవాని పేరు విజయపాలుడు. కూతురు పేరు మందారవతి.

రాజు ప్రతిరోజు రథముమీద షికారుకు వెళ్లేవాడు. తోటలో నుండి వచ్చేటప్పుడు ఒక మామిడిచెట్టుకు ఒకబంగారపు కాయ చూసేవాడు. మరుసటిరోజున ఉదయం ఎవరైనా బ్రాహ్మణుడికి ఇవ్వాలని అనుకొని ఇంటికి వెళ్లిపొయ్యేవాడు. రెండవరోజున వచ్చిచూస్తే కాయ కనపడేదికాదు. ఇలా కొద్దికాలం జరిగింది. రాజు ఒకరోజున శూరసేనుని పిలిచి మామిడికాయ ఎవరు తీసికొని పోతున్నదీ కనిపెట్టమని చెప్పాడు. సరే అని పెద్దకొడుకు సాయంత్రం భోజనంచేసి వెళ్ళాడు. రాత్రి పదకొండు గంటలవరకు ఓపికతో కూర్చున్నాడు. కాని నిద్రవచ్చి పండుకొన్నాడు. ప్రొద్దున్న చూస్తే కాయ కనబడలేదు. రెండవ రాత్రి ఖారవేలుడు కాపలా కాశాడు. ఇతడుకూడా రాత్రి పంద్రెండు గంటలకు నిద్రపోయాడు. ఆ రాత్రి కూడా కాయ ఎవరు తీసికొని పోయిందీ తెలియలేదు. మూడవరాత్రి విజయపాలుడు కాపలా కాశాడు. రాత్రి ఒంటిగంటకు ఒక బంగారపురంగు పక్షివచ్చి కాయను ముక్కుతో తుంచి ఎగిరిపోతున్నది. విజయపాలుడు బాణంతో ఆపక్షిని కొట్టాడు. పక్షి ఎగిరిపోయింది కాని, బాణము ఆ పక్షి రెక్కకు తగిలి ఒక ఈక క్రిందపడింది. ఆ ఈక బంగారురంగు కలిగి చాలా అందంగా ఉంది. దానిని తీసికొనివెళ్ళి తండ్రికి యిచ్చాడు. విక్రమసింహుడు ఆ ఈకనుచూచి చాల అశ్చర్యపోయాడు. పక్షిని తీసికొనివచ్చినవారికి తన రాజ్యంలో సగం భాగం యిస్తానన్నాడు.

రచన : ఆర్. వెంకటేశ్వర్లు - రాజమండ్రి.



శూరసేనుడు పక్షిని తీసుకొనిరావటానికి బయలుదేరాడు. దారిలో ఒక నక్క కనబడి, "ఎక్కడికి పోతున్నావు యువరాజా" అని అడిగింది.

"బంగారుపక్షికోసము వెళ్లుతున్నా" నని చెప్పాడు శూరసేనుడు.

అప్పుడు నక్క యిలాఅంది: "నీవు వెళ్లేటప్పుడు దారిలో రెండుమేడలుకనిపిస్తాయి. ఒకమేడలో దీపాలు వెలుగుతూఉంటాయి. నృత్యవాద్యాలు జరుగుతుంటాయి. రెండవమేడ చీకటిగా ఉంటుంది. చీకటి మేడలోకి వెళ్లినట్లయితే పక్షి దొరుకుతుంది. దీపాలున్న మేడలోకి వెళ్లవద్దు."

శూరసేనుడు సరే అని బయలుదేరివెళ్లి నక్క చెప్పిన మేడలదగ్గరకు వచ్చాడు. దీపములతో ఉన్న మేడ చూశాడు. లోపల నృత్యవాద్యములు జరుగుతున్నాయి. రెండవ వైపు మేడను చూస్తే చీకటిగా ఉంది. ఈ చీకటి మేడలోకి వెళ్లి నేనేం చెయ్యాను అనుకొని దీపములున్న మేడలోకి వెళ్లాడు. లోపలకు వెళ్ళగానే వారకాంతలు అతనికి సారాయి తాగించి ఆటపాటలలోకి దింపారు. శూరసేనుడు ఇక యిల్లుమాటే మరచిపోయాడు.

చాలకాలంవరకు శూరసేనుడు రాకపోవడంవల్ల ఖారవేలుడు బయలుదేరాడు. ఇతనికికూడ దారిలో నక్క కనబడి, యిదివరకు శూరసేనుడికి చెప్పినట్లే చెప్పింది. ఇతడుకూడ నృత్యవాద్యాలు జరుగుతున్న మేడలోకి వెళ్ళాడు. మళ్లీ తిరిగి రాలేదు.

ఖారవేలుడుకూడ చాల కాలంవరకు రాకపోవడంవల్ల విజయపాలుడు పక్షికోసం బయలుదేరాడు. ఇతనికి కూడ నక్క దారిలో కనబడి చీకటి మేడలోకి వెళ్ళమని చెప్పింది. సరే అనిచెప్పి మేడల దగ్గరకు వచ్చాడు. దీపములున్న మేడలోకి తొంగిచూచాడు. చాలమంది ఆడవాళ్లు కనబడ్డారు. నృత్యవాద్యాలు జరుగుతున్నాయి. "మారాజ్యంలో అనేక రకాల

నృత్యాలు జరుగుతుండగా ఈ నృత్యాలే చూడాలా" అని అనుకొని చీకటి మేడ లోకి వెళ్ళాడు. కాని లోపల ఏమీ కన బడలేదు. తిరిగి బయటికి వచ్చేటప్పటికి నక్క కనబడింది. "పక్షి కనబడుతుందని చెప్పావుగదా? ఏది?" అని అడిగాడు. నక్క అతన్ని తన వీపుమీద కూర్చోమంది. విజయపాలుడు అలాగే కూర్చున్నాడు. నక్క అతనిని ఒక కోటదగ్గరకు తీసికొని పోయి యిలాచెప్పింది: "నీవు కోటలో ఏడు గుమ్మములు దాటినతరువాత ఒక బంగారు పక్షి కనబడుతుంది. దారిలో నిన్ను ఎవ్వరూ అడ్డగించరు. అక్కడ రెండు పంజరము లుంటాయి. ఒకటి బంగారు పంజరము. రెండవది కఱ్ఱ పంజరము. నీవు ఆ పక్షిని బంగారు పంజరములో పెట్టక కఱ్ఱ పంజరంలో ఉంచి తీసుకురా."

విజయపాలుడు సరేనని కోటలో ప్రవే సించి ఏడు గుమ్మములు దాటగానే పక్షి కన్పించింది. పక్షి చాల అందంగా వుంది. ప్రక్కనున్న పంజరముల రెంటిని చూచాడు. బంగారు పక్షిని కఱ్ఱ పంజ రములో ఉంచితే బాగుండదని బంగారు పంజరంలో ఉంచాడు. పక్షి వెంటనే కూసింది. తక్షణం రాజభటులువచ్చి పట్టు కొని అతనిని రాజుదగ్గరకు తీసుకువెళ్ళారు.

"నీవు ఎవరవు? ఎందుకు మా కోటలోకి వచ్చావు?" అని అడిగాడు రాజు.




"మాది పాటలీపుత్రము. నేను విక్రమ సింహుని కొడుకును. మా తోటలోని మామిడికాయను ప్రతిరోజు ఈ పక్షి తీసికొని వస్తోంది. ఒక రోజు రాత్రి నేను దీనిని చూచి బాణంతో కొట్టాను. కాని గురితప్పి రెక్క చివర తగిలి ఒక ఈక క్రింద పడింది. నేను దానిని మా తండ్రికి చూపించాను. దానిని చూడగానే మా తండ్రి ఈపక్షి కావాలన్నారు. అందుకని వచ్చాను" అన్నాడు విజయపాలుడు.

రాజు తనకు ఒక "బంగారు గుఱ్ఱము" పట్టితెచ్చి ఇస్తే తాను బంగారు పక్షిని యిస్తా నన్నాడు. గుఱ్ఱాన్ని ఒక నెల



దినములలో తీసికొని రాకపోతే తనను వెదకి పట్టించి తల నరికిస్తానన్నాడు. విజయపాలుడు అలాగే గుఱ్ఱాన్ని తెచ్చి ఇస్తానని చెప్పి బయటికి వచ్చాడు.

మళ్లీ నక్క కనిపించి "పక్షి యేమైంది" అని అడిగింది. విజయపాలుడు జరిగిందంతా చెప్పాడు. నక్క అతడ్ని వీపుమీద కూర్చొబెట్టుకొని యింకొక కోట దగ్గరకు తీసికొని వచ్చింది. అక్కడ కూడ నక్క రాజకుమారునితో "ఏడవగుమ్మము దాటిన తరువాత ఒకగుఱ్ఱం కనబడుతుంది. అక్కడే ఒక బంగారుజీను, ఒక తోలుజీను వుంటై. గుఱ్ఱంమీద బంగారుజీను వెయ్యక తోలుజీను వేసుకొనిరా" అని చెప్పింది. సరేనని విజయపాలుడు కోటలో ప్రవేశించి ఏడు గుమ్మములు దాటాడు. ఆఖరి గుమ్మముదగ్గర గుఱ్ఱం కన్పించింది. ప్రక్కనే రెండుజీనులు వున్నై. అంత అందమైన గుఱ్ఱానికి తోలుజీను బాగుండదని బంగారుజీను వేశాడు. వెంటనే గుఱ్ఱం సకిలించింది. రాజభటులు వచ్చి అతనిని పట్టుకొని రాజుదగ్గరకు తీసికొని వెళ్ళారు.

రాజు అతనిని "నీవెవరవు? ఎందుకు మా కోటలోకి వచ్చావు?" అని అడిగాడు. విజయపాలుడు జరిగినదంతా చెప్పాడు.

రాజు తనకు "బంగారురాణిని" యిస్తే తాను బంగారు గుఱ్ఱాన్ని యిస్తానన్నాడు. పదిహేనురోజులలోగాని రాకపోతే తల నరికిస్తానన్నాడు.

విజయపాలుడుబయటకువచ్చాడు.మళ్లీ నక్క కన్పించి గుఱ్ఱం ఏమైందనిఅడిగింది. తాను చేసిన పొరబాటును చెప్పాడు. నక్కకు చాలకోపంవచ్చింది. కాని అతనిని ఏమీ అనలేదు. మళ్ళీ అతనిని తన వీపుమీద ఎక్కించుకొని యింకో కోట దగ్గరికితీసికొనివచ్చి "కోటలోకివెళ్లినతర్వాత ఒక తోట కనబడుతుంది. అందులో ఒక చెఱువు ఉంటుంది. అక్కడకు రాత్రి పండ్రెండు గంటలకు ఒక రాజకుమార్తె స్నానానికి వస్తుంది. నీవుచెట్టుచాటున దాగి

అమెను పట్టుకుంటే నీతో కూడా వస్తానని అంటుంది. మళ్లీ నీవు వెనుకకు పంప కుండా అమెని తీసికొని రా" అని చెప్పింది.

విజయపాలుడు సరేనని లోపలకు వెళ్ళి తోటలో చెట్టుచాటున దాక్కున్నాడు. రాత్రి పండ్రెండు గంటలకు రాజకుమార్తె స్నానా నికి వచ్చింది. విజయపాలుడు వెనగ్గా వెళ్లి అమెని పట్టుకున్నాడు. అప్పు డామె "నీతో వచ్చేస్తాను" అంది. అతడు సరే అని రాణిని తీసికొని వస్తున్నాడు. కొంత దూరం వచ్చిన తరువాత రాణి తన తల్లి దండ్రు లను చూచివస్తాననిచెప్పింది. కాని అతడు వినిపించుకొనకుండా ముందుకు సాగిపో తున్నాడు.రాణి అతడ్ని బ్రతిమాలింది. కాని అతను ఒప్పుకోలేదు. అమె ఏడ్చింది. విజయపాలుడు "సరే వెళ్లి త్వరగారా" అన్నాడు. అమాట అనేలోపలనే రాజ భటులు వచ్చి అతనినిపట్టుకొని రాజుదగ్గ రకు తీసికొనివెళ్లారు.

రాజు అతనిని "నీ వెందుకు వచ్చావు?"అని అడిగాడు. విజయపాలుడు తాను వచ్చినపనిని చెప్పాడు. అప్పుడు రాజు కిటికీలో నుంచి ఒక పెద్దకొండను చూపించి దానిని వారం రోజులలో త్రవ్వి వేయమన్నాడు. అలాగ త్రవ్వినట్లయితే తన కూతుర్ని యిస్తానన్నాడు. లేకపోతే బుర్ర తీయిస్తానన్నాడు. ఒక పార, గున



పము, తట్ట యిచ్చారు. అవి పట్టుకుని బయటకు వచ్చాడు విజయపాలుడు. మళ్లీ నక్క ఎదురైంది. రాణిని తీసుకొని రానందుకు నక్కకు చాల కోపము వచ్చి అతనితో మాట్లాడకుండా వెళ్లిపోయింది.

పాపం విజయపాలుడు అ కొండ దగ్గ రకు వెళ్లి అక్కడే ఏడుస్తూ కూర్చున్నాడు. ఐదు రోజులు గడచిపోయినాయి. కాని, కొండమాత్రం మామూలుగానే ఉంది.

అరవరోజుననక్కవచ్చి రాజకుమారుణ్ణి కొండ త్రవ్వలేదేమని అడిగింది. అతడు సమాధానం చెప్పలేదు. నక్క వెళ్లి పోయింది.



ఏడవరోజు రాత్రి మళ్లీ నక్క అక్కడికి వచ్చి చూసింది. అతడు నిద్రపోతూనే ఉన్నాడు. తెల్లవారితే గడువు తీరిపోతుంది. రాజుగారు ఉరితీస్తాడు. అప్పుడు నక్క కొండను మాయం చేసింది. ఉదయం రాజకుమారుడు లేచి చూచేటప్పటికి కొండ కనబడలేదు.కంగారుపడినక్కనుఅడిగాడు. నక్క తాను మాయం చేశానని చెప్పింది.

ఇంతలో రాజభటులు విజయపాలుణ్ణి రాజుదగ్గరకు తీసుకువెళ్లారు. "కొండ త్రవ్వేవా?" అని అడిగాడు రాజు.

విజయపాలుడు "త్రవ్వా"నని చెప్పాడు. రాజు దూరదర్శిని యంత్రంతో చూచాడు. కొండ లేదు. దానికి అవతలఉన్న గ్రామాలన్నీ కనపడ్డాయి. అప్పుడు రాజు తన కుమార్తెను విజయపాలుని కిచ్చి పంపాడు.

ఇద్దరూ నక్కమీద కూర్చుని బంగారు గుఱ్ఱంఉన్న కోటదగ్గరకువచ్చారు. రాణినీ, గుఱ్ఱాన్నీకూడ విజయపాలునికే వచ్చేటట్లు చేయాలని నక్క అనుకుంది. రాజకుమారునితో నక్క "నీవు రాణినిలోపలకు తీసికొని వెళ్లినతరువాత రాజు నీకు గుఱ్ఱాన్ని యిస్తాడు. దాని ముఖం కోటవైపు ఉంచేటట్లు చూచి రాణితో వెళ్లిపోతానని చెప్పు. అప్పుడు రాణి నీకు నమస్కారం చేస్తుంది. వెంటనే రాణిని గుఱ్ఱంపైకి లాగి చల్ అనగానే గుఱ్ఱం పరుగెత్తుకొని వచ్చేస్తుంది" అని చెప్పింది. సరే అని రాజకుమారుడు రాణిని కోట లోపలకు తీసికొని వెళ్లాడు. రాజు గుఱ్ఱాన్ని తీసుకొచ్చి విజయపాలునికి ఇచ్చాడు. విజయపాలుడు గుఱ్ఱంమీద కూర్చుని రాణితో వెళ్లిపోతానని చెప్పాడు. రాణి నమస్కరించింది. అప్పుడు రాణిని పైకి లాగి గుఱ్ఱాన్ని 'చల్' అని అన్నాడు. వెంటనే గుఱ్ఱం పారిపోయింది. నక్క గుఱ్ఱంవెనుక పరుగెత్తింది. రాజు కొందరు రౌతులను పంపించాడు. కాని గుఱ్ఱం దొరకలేదు.

విజయపాలుడు తిన్నగా పక్షి ఉన్న కోటదగ్గరకు వచ్చాడు. నక్క పక్షినీ,

గుఱ్ఱాన్నీ కూడా రాజుకుమారునికి వచ్చేటట్లు చేద్దామనుకొంది. అతనితో "నీవు గుఱ్ఱాన్ని లోపలకు తీసికొని వెళ్లిన తరువాత పక్షిని పంజరములో పెట్టి నీ కిస్తారు. వెనుకటి వలెనే గుఱ్ఱాన్ని చల్ అనగానే వచ్చేస్తుంది" అని చెప్పింది. విజయపాలుడు లోపలకు వెళ్లి పంజరాన్ని పట్టుకొని నక్క చెప్పినట్లు చల్ అన్నాడు. వెంటనే గుఱ్ఱం అక్కడనుంచి పారిపోయింది. రాణి నక్కమీద కూర్చుంది. నక్క గుఱ్ఱం వెనకాల పరుగెడుతోంది.

అలా వాళ్లు తిన్నగా యిదివరకు వచ్చిన మేడలదగ్గరకు వచ్చారు. అక్కడ ఆగి విజయపాలుడు నక్కతో "నీవు నాకు చాల సహాయంచేశావు. నీకు ఏది కావాలో కోరుకో. ఇస్తాను" అన్నాడు.

"నీ చేతిలో ఉన్న బాణంతో నన్నుకొట్టు. అంతకన్న వేరేసహాయం నాకు అక్కర్లేదు" అన్నది నక్క.

"అమ్మయ్యో! నాకు నీవు ఎన్నో కష్టాలు పడి ఈ మూడింటిని సంపాదించి ఇచ్చావు. నిన్నుమాత్రం నేను చంపలేను" అన్నాడు విజయపాలుడు.

నక్క పోనీలే అని చెప్పి "నీవు వెళ్లేటప్పుడు దారిలో యిద్దరను ఉరి తీస్తూ ఉంటారు. వారిని మాత్రము కొనవద్దు. కాని, ఒకవేళ కొన్నా నూతి అంచుమీద



మాత్రం కూర్చోవద్దు" అనిచెప్పింది. విజయపాలుడు సరే అని చెప్పి బయలుదేరాడు.

దారిలో ఒకచోట ఇద్దరు మనుష్యులను ఉరితియ్యడం చూచాడు. దగ్గరకు వెళ్లాడు. వాళ్లు తన సోదరులే!! వారిని ఉరి తియ్యటానికి కారణం ఏమిటని అడిగాడు. వాళ్లు అప్పులుచేసి ఎంతకాలమైనా తీర్చక పోవడంవల్ల ఉరితీస్తున్నామని చెప్పారు. విజయపాలుడు వాళ్ళకు రావలసిన డబ్బు యిచ్చి తన సోదరులను విడిపించాడు.

ముగ్గురుకలసి వెడుతున్నారు. దారిలో ఒకచోట కూర్చున్నారు. ఏవేవో మాటలు చెప్పి అతడ్ని సోదరులిద్దరు ఒక నూతి

దగ్గరకు తీసికొనివచ్చి నూతి అంచుమీద కూర్చోపెట్టారు. పాపం, నక్క చెప్పిన మాట విజయపాలుడికి జ్ఞాపకంలేదు. మాటల సందడిని శూరసేన, ఖారవేలు లిద్దరు అతనిని నూతిలోకి త్రోసివేసి, రాణినీ, గుఱ్ఱాన్నీ, పక్షినీ తీసికొనిపోయి తండ్రికి చూపించారు. తామే తీసుకొని వచ్చామని చెప్పారు. అప్పటినుంచి రాణి ఎవరితోనూ మాట్లాడటంలేదు. గుఱ్ఱం గడ్డి మేయటం లేదు. పక్షి పలకటం లేదు.

నక్క నూతిదగ్గరకు వచ్చి చూసింది. విజయపాలుడు లోపల ఉన్నాడు. "నేను నిన్ను నూతి అంచుమీద కూర్చోవద్దని చెప్పాను గదా! మరి యిలా ఎందుకు జరిగింది?" అని నక్క అడిగింది. విజయపాలుడు ఏమీ మాట్లాడలేదు.

"ఇప్పుడైనా నన్ను చంపుతావా? నిన్ను బైటకు తీస్తాను" అని అడిగింది నక్క.

"సరే అలాగే" అన్నాడు. నక్క నూతిలోకి దూకి తనతోక గట్టిగా పట్టుకోమంది. విజయపాలుడు అలాగే చేశాడు. నక్క పైకి ఒక్క గంతువేసింది. ఇద్దరూ బయటపడ్డారు.

తర్వాత విజయపాలుడు బాణంతో నక్కను కొట్టాడు. వెంటనే నక్క ఒక చక్కని రాజకుమారునిగా మారిపోయింది. విజయపాలుడు ఆశ్చర్యపోయి, "నీ వెవరవు? ఎందుకీ నక్కరూపంతో ఉన్నావు?" అని అడిగాడు.

"నేను ఒక మునిశాపంవల్ల నక్కగా మారిపోయాను. బంగారురాణి నా చెల్లెలు" అనిచెప్పాడు. ఇద్దరూ కలసి పాటలీపుత్రం బయలుదేరారు.

విజయపాలుడు పట్టణంలో అడుగు పెట్టగానే ఆ క్షణంవరకూ ఏమీ తినకుండా దిగులుగా వుంటున్న రాణీ, గుఱ్ఱం, పక్షి ఎంతో సంతోషంగా కన్పించసాగినై. రాణి తల దువ్వుకొని క్రొత్తబట్టలు కట్టుకొంది. గుఱ్ఱం త్వరగా గడ్డిమేయసాగింది. పక్షి మాట్లాడటం ప్రారంభించింది. వీ రిద్దరు యింటికి వచ్చి విక్రమసింహునితో జరిగినదంతా చెప్పారు. అప్పుడు విక్రమసింహుడు రాణిని పిలిచి, అడిగాడు! రాణికూడ నిజం చెప్పింది. శూరసేనుణ్ణి, ఖారవేలుడ్ని పిలిపించి ఉరిశిక్షవిధించాడు. విజయపాలుడికి బంగారు రాణిని, తన కూతురైన మందారవతిని రాణిసోదరునకూ యిచ్చి గొప్ప వైభవంతో పెండ్లి చేశాడు.

కథ కంచికెళ్లింది, మనమింటికివచ్చాం.





అబ్బాయిలూ, అమ్మాయిలూ!

పై చిక్కుచదరంలో ఒకమూల కోడి, మరో మూల దాని పిల్లలూవున్నై. కోడి ఆహారానికి బయలుదేరి చాలదూరం వచ్చేసింది. తిరిగి యింటి కెలాపోవాలో తెలియక ఆలోచిస్తోంది. మీకు దారితెలిస్తే, పాపం, కోడిని దాని పిల్లలదగ్గరికి చేర్చండి చూద్దాం.

## నాగుపాము ముగ్గులు





ఈ ముగ్గులు పంపినది : బి. విజయలక్ష్మి, మద్రాసు.




( గతసంచిక తరువాయి )

ఇది జరిగిన కొద్దికాలానికే వర్ధమానుడు రాజధాని నగరానికి పోవటానికి అనుమతి, ఆహ్వానమూ కూడా సంపాదించాడు. " మనిషిపర్వతం " వస్తున్నవార్త వినగానే జనమంతా ఇళ్లలో దూరారు. అనేకమంది అతన్ని చూడటానికి ఇళ్ళకప్పు లెక్కారు. రాజవీధుల్లో తప్ప అతనికి నడవటానికి జాగాలేదు. ఊరిమధ్య రాజభవనంఉంది. దానిచుట్టూ ప్రహరీగోడ లున్నాయి. వర్ధమానుడు వాటిమీదిగా అంగవేసి అంతపుర ఆవరణ ప్రవేశించాడు. అతను లోపల ఉన్న ఆసనాలూ, తివాసీలూ మొదలైనవి చూడటానికి నేల బారుగా పడుకుని కిటికీలో నుంచి చూడవలసి వచ్చింది.

రాజుగారు చూపిన ఆదరానికి వర్ధమానుడు చాలా సంతోషించాడు. తన కృతజ్ఞత యెట్లా చూపడమా అని ఆలోచించాడు. ఇందుకు అవకాశం త్వరలోనే కలిగింది.

వామనద్వీపానికి దగ్గిరలో మరొక చిన్న ద్వీపం ఉన్నది. అక్కడి ప్రజలు కూడా వామనులవంటివారే. వారిపేరు గుజ్జులు. గుజ్జులకూ వామనులకూ అనాదిగా పోట్లాటలున్నాయి. కాని ఇటీవల కొద్దిమాసాలుగా ఈ పోట్లాటలకు విరామం కలిగింది. కారణ మేమంటే గుజ్జులరాజు వామనుల మీద దాడిచెయ్యటానికి కొన్ని కొత్తనావలు సిద్ధం చేయించాడు. ఈ యుద్ధనావలు

జోనాథన్ స్విఫ్టు వ్రాసిన 'గల్లివర్స్ ట్రావెల్సు'కు అనుకరణ.



యిప్పుడు సిద్ధమయాయనీ, గుజ్జులు ఏ క్షణాన అయినా దండెత్తి రావచ్చుననీ వామనరాజుకు కబురు వచ్చింది. ఆయన వర్ధమానుడి సహాయం కోరాడు. వామనులకు సహాయంచేస్తాననీ, తాను చెప్పినట్టు చేస్తే గుజ్జుల యుద్ధనౌక లన్నిటినీ పట్టి తెస్తాననీ వర్ధమానుడు చెప్పాడు.

రాజుకు పరమానందం కలిగింది. ఏమేమి కావాలో చెప్పి చేయించుకో మన్నాడు. వర్ధమానుడు తనకు తగినంత మోకూ, లావుపాటి ఇనపచువ్వలూ కావాలన్నాడు. కాని వామనుల దగ్గిర ఉన్న మోకులు ట్వయిను దారంకంటె ఆటే లావులేవు; ఇనపచువ్వలు తీగె మేకుల లాగున్నాయి.

వీటితోనే వర్ధమానుడు పని ప్రారంభించాడు. తనకుదొరికిన తాటిని మూడుపేటల పేని కాస్తబలమైన తాడు తయారుచేశాడు. ఈ విధంగా యాభైతాళ్లు తయారుచేశాడు. మూడేసిచువ్వలు కలిపి మెలిపెట్టి, వంచి, యాభైకొంకీలు తయారుచేశాడు. ఒక్కొక్క తాటి చివరా ఒక్కొక్క కొంకీ కట్టాడు.



వీటన్నిటినీ భుజానవేసుకొని గుజ్జులనౌకలు వచ్చే దిక్కుగా సముద్రతీరానికి వెళ్లాడు.

గుజ్జులద్వీపానికి వామనద్వీపానికీ మధ్య సన్నని జలసంధి మాత్రమే అడ్డం ఉంది. ఇది యెక్కడా నిలువులోతుకంటె లేదు. వర్ధమానుడికి దూరాన గుజ్జులనౌకలు కనిపిస్తూనే ఉన్నాయి. అన్నీ కలిసి యాభై యుద్ధనౌకలూ, కొన్ని చిల్లరపడవలూ ఉన్నాయి. వర్ధమానుడు నీటిలో దిగి వాటికేసి నడువసాగాడు.

అతను ఏంచేస్తాడో చూద్దామని వామనుల రాజూ అతని పరివారమూ తీరానికి వచ్చారు. గుజ్జులు నౌకలలో ఏదో పనులు చేసుకుంటూ తమకు రానున్న ఆపద గురించి ఆలోచించటమే లేదు. "మనిషి పర్వతం" గురించి వారికి వార్త చేరలేదు.

వర్ధమానుడు కొద్దిదూరం ఈదినాక మళ్లా ఆవతల అడుగు అందింది. అతను నీళ్ళలోనుంచి నడుచుకుంటూ వచ్చే చప్పుడు విని గుజ్జులు పొందిన





ఆశ్చర్యం చూసి తీరాలి. పెద్ద భూతంవంటి మనిషి వస్తూండటం చూడగానే గుజ్జులు నౌకలమీద తాముచేస్తున్న పనులుమానేసి ప్రాణాలు రక్షించుకునేటందుకు పారిపోయినారు. వాళ్లను చూస్తూ కాలయాపనచెయ్యక వర్ధమానుడు తాను తెచ్చిన తాళ్ళను పడవలకు కొంకిలతో బిగించి కట్టి, తాళ్ళన్నిటినీ కలిపి ముడేసి, ఆ ముడి చేత్తో పట్టుకున్నాడు.

ఈలోగా గుజ్జులు చూస్తూ ఊరుకోలేదు. వారు విల్లు బాణాలు పట్టుకొని ఈసమయానికి వర్ధమానుడిమీద బాణాల వర్షం కురిపించ సాగారు. ఆ బాణాలు కంటికి తగులుతా యనే భయంతప్ప వర్ధమానుడికి మరే భయమూలేదు. అందుచేత అతనిప్పుడు రాజభటుల కంటపడకుండా దాచిన సులోచనాల జోడుతీసి కళ్లకు తగిలించుకొని నిర్భయంగా తనపని చూసుకో సాగాడు.

అయితేఇప్పుడు మరొకచిక్కు వచ్చింది. గుజ్జుల నౌకలన్నిటికీ లంగర్లు దించి ఉన్నాయి. వీటిని ఎత్తేఅవకాశం లేదు. అందుచేత వర్ధమానుడు తన పిడి చాకుతో లంగరు గొలుసులన్నీ గబగబా కోసి పారేశాడు. ఇది చూసి గుజ్జులకు మరింత ఆదుర్దా కలిగింది. వాళ్లు వర్ధమానుడిమీద మళ్లీ బాణాలు కురిపించారు. కాని వర్ధమానుడు వాటికి లక్ష్యంచెయ్యకుండా పడవలను పట్టుకుని తిరిగి వచ్చాడు. అతని వెనకనే యాభై శత్రునౌకలూ వస్తున్నాయి.





ఇదిచూసి సముద్రతీరానచేరిన ప్రజలు ఒక్కసారిగా, "వామనమహారాజుకూ జై!" అని కేకలుపెట్టారు. మహారాజు కూడా సంతోషంతో పరవశుడైపోయి వర్ధమానుడికి ఒక పెద్ద బిరుదిచ్చాడు.

ఈవిధంగా రాజుగారి అదరానికిపాత్రం కావడం వర్ధమానుడికే అపకారమయింది. వామనులకు యింత సహాయంచేసిన వర్ధమానుడు యింకెంత చెయ్యలేడు? అని రాజుకు దుర్యాశ పుట్టింది.

"నువు వెంటనే వెళ్లి గుజ్జుల మిగత పడవలు కూడా పట్టుకో. ఒక్క పడవలు పట్టుకోటం కాదు. గుజ్జులను పూర్తిగా నాశనంచెయ్యటానికీ, వాళ్లదేశాన్ని పూర్తిగా ఆక్రమించుకోవడానికీ నువు సహాయపడాలి. అప్పుడు నేను ప్రపంచానికంతకీ అధిపతి నౌతాను" అన్నాడు రాజుగారు వర్ధమానుడితో.

ఇటువంటి దుర్మార్గానికి వర్ధమానుడు ఒప్పుకోక, 'గుజ్జులరాయబార్లు చెప్పే న్యాయమైన షరతులకు ఒప్పుకుని మీరు సంధి చేసుకోవడం ధర్మం' అన్నాడు రాజుతో.



గుజ్జుల రాయబారులు సంధికోసంవచ్చి, వర్ధమానుడు తమకున్యాయంగా మాట్లాడాడని విని అతని దర్శనం చేసుకుని, అతని శౌర్య పరాక్రమాలనూ గుణ గణాలనూ పొగడి, తమ దేశం రావలసిందనీ, తమ రాజుగారికి దర్శనం ఇప్పించవలసిందనీ కోరారు. వర్ధమానుడు కూడా గుజ్జుల రాజుగారి కీర్తి జగద్విఖ్యాతమనీ, వారికి తన నమస్కారాలు అందజేయవలసిందనీ, ఎప్పటికైనా తప్పక తాను ఆ రాజుగారి



దర్శనం చేసుకోకుండా స్వదేశానికి వెళ్లి పోనన్నీ రాయబారులకు తెలియజేశాడు.

వర్ధమానుడు సహాయనిరాకరణం చెయ్యటం వల్ల వామనరాజుగారు గుజ్జు రాయబారుల షరతులపైనే సంధి చేసుకోవలసి వచ్చింది. కాని, ఆయనకు వర్ధమానుడిమీద ఆగ్రహం కలిగినవి. అతని మీద దుస్తంత్రాలు పన్నేవారి మాటలు రాజుగారు ఆలకించసాగాడు.

గుజ్జులదేశానికి వెళ్లాలని వర్ధమానుడికి ఆత్రం కలిగింది. అక్కడికి పోవటానికి రాజుగారి అనుమతి వేడాడు. రాజుగారు బలవంతాన అనుమతించాడు. కాని రాజు తనను హత్య చేయించటానికి ప్రయత్నిస్తున్నాడని వర్ధమానుడు తనహితులద్వారా తెలుసుకున్నాడు. ఇది అసత్యవార్త అని తోచింది కాని, వెంటనే నిజమేనని రూఢి అయింది. కనుక, అలస్యం చేయకుండా తక్షణమే వర్ధమానుడు గుజ్జులరాజు దగ్గిరికి ప్రయాణమైపోయి అభయం పొందాడు.

కొద్దికాలం అక్కడగడిచినాక ఒకనాడు దారితప్పిన ఓడ ఒకటి గుజ్జులదేశం సమీపించగా వర్ధమానుడు అందులో ఎక్కి స్వదేశానికి ప్రయాణంకట్టాడు. గుజ్జులరాజు అతనికి ఎంతో సహాయంచేసి అనేక బహుమతులతో సహా సాగనంపాడు.

కొద్దిరోజులకు వర్ధమానుడు సురక్షితంగా తన స్వదేశానికి తిరిగి వచ్చేసి ఆ కథలన్నీ పిల్లలకు చెప్పసాగాడు

[ఇంకా వుంది]





# నక్క సాయం

అనగనగా ఒక ఊళ్లో ఒక బీద బ్రాహ్మడు ఉండేవాడు. ఆయన ప్రతి రోజూ ప్రక్క నున్న పట్టణానికి యాయవార మెత్తు కోటానికి పోతూ ఉండేవాడు. రోజూ పొద్దున్నే వెడుతూ ఉండేటప్పుడు దారిలో మన బాపనయ్యకు ఒక నక్క కనిపిస్తూ ఉండేది. బాపనయ్య ఆ నక్కను కూర్చో బెట్టి "యీవేళ మంగళవారం, దశమి తిథీ, శతభిష నక్షత్రం, పగలువర్జ్యంలేదు" అని పంచాంగం తీసి నక్కకి చెప్పి మరీ పోతూ ఉండేవాడు.

"ఓ పిచ్చిబ్రాహ్మడా! నాకు పంచాంగ మెందుకు? నేను నీ కేమన్నా యిచ్చే దాన్నా? చేసేదాన్నా? అయినా నా రాచ కార్యాలన్నీ చెడిపోతున్నాయి కనకనా?" అని అంటూ వింటూవుండేది నక్క.

"నక్కబావా! నక్క బావా! నువ్వు నాకేమీ యివ్వ నక్కరలేదు. నీ దయ నా మీద ఉంటే చాలు" అని వెళ్లిపోతూ ఉండేవాడు బాపనయ్య.

ఈలా రోజూ నక్కకి పంచాంగము చెప్పనిదే వెళ్లేవాడుకాదు. బ్రాహ్మణ్ణి చూచి నప్పుడల్లా 'యీయన కేమీ సాయం చేయ లేక పోతున్నామే' అని బాధపడుతూ ఉండేది నక్క. ఈలాగ చాలా రోజులు గడిచిపోయాయి.

ఆ పట్టణాన్ని అశక్తభూపాలుడనే మహా రాజు పాలిస్తూ ఉండేవాడు. ఆయన ఒక సామంతరాజును మోసపుచ్చి, అతని కూతుర్ని ముసలితనంలో మూడో పెళ్ళి చేసుకున్నాడు. ఆ ముసలిరాజుతో కాపు రం చెయ్యడాని కిష్టంలేదు, ఆ ముద్దుల రాణికి. అందుచేత రాజుగారికి తెలియ కుండా తన ఆభరణాలూ, కట్టుకొనే బట్టలూ అన్నీ తీసుకొని ఒకనాటి అర్ధరాత్రి వేళ తన కన్నవారింటినించి వచ్చిన చాకలి సాయంతో రాణి పుట్టింటికి బయలుదేరింది.

గోకరాజు బంగారమ్మ, జువ్వలపాలెం.



పట్టణందాటి వచ్చేశా రిద్దరూ. ఊరు బయట పారుతోందో ఉప్పుటేరు. అర్ధరాత్రి అవడంచేత అక్కడ నావలేమీ లేవు. "ముందుగా నగలూ, బట్టలూ అన్నీ అవతలొడ్డుకు చేర్చి తరువాత మిమ్మల్ని చేరుస్తాను" అన్నాడు చాకలి. రాణీ కూడా సరేనంది. చాకలికి బట్టలూ, ముక్కుపుడకతో సహా ఆభరణాలూ అన్నీ యిచ్చింది రాణి. అవన్నీ తీసుకొని సురక్షితంగా ఏటి అవతలి ఒడ్డుకి చేరుకున్నాడు చాకలి. ఇంక ఆలోచన మొదలెట్టాడు. "రాణీని నేను కన్నవారింటికి తీసుకెళ్లినట్లు తెలిస్తే రాజు నన్ను చంపుతాడు. ఈవిణ్ణి తీసుకువెళ్లడమంటే బుద్ధిపూర్వకంగా చావు కోరుకోవడమన్న మాట." ఇలా అనుకుని ఆభరణాలతోటి పరారయ్యాడు చాకలి. ఇవతలొడ్డునుంచి కేకలువేయ మొదలెట్టింది రాణి. జవాబు చెప్పడానికి వా డక్కడుంటేగా? చాకలి యెంతసేపటికీ రాకపోవడం, తను ఒక్కర్తె ఒంటరిగా ఉండడం, ఇంతలో తెల్లవారబోతూఉండడం, యివన్నీ రాణికి పిచ్చెత్తినట్లయి ఆలోచిస్తూ కూర్చుంది.

ఇంతలో ఓ మాంసపు ముక్క నోటకరచుకొని ఆ దారే పోతోంది మన నక్క. తిన్నగా రాణిఉన్న రేవుదగ్గర కొచ్చేసరికి ఏటిలో ఓ చేప ఎగరడం చూసిందినక్క. వెంటనే తన నోట్లోఉన్న మాంసపుముక్క ఒడ్డున పారేసి, ఏట్లో వున్న చేపకోసరం ఉరికింది. నక్క ఉరికేసరికి ఏట్లో చేప కాస్తా దాటిపోయిండి. ఒడ్డున ఉన్న మాంసపు ముక్క ఒక డేగ తన్నుకుపోయింది. నక్క యిటు చేపకూ, అటు ముక్కకూ రెంటికీ చెడి తెల్లబోయి నుంచుంది ఒడ్డున.

నక్కస్థితి అంతాచూచి ఫక్కున నవ్వింది, మన పడుచు రాణి. నవ్వడమే కాకుండా పరిహాసం కూడా ఆడింది. దాంతో నక్కకు ఎక్కడలేని కోపం వచ్చింది. "ఓసి పిచ్చిదానా! ముందు నీగతి

చూచుకో. ఇటు పుట్టింటికి చెడ్డావు. అటు మెట్టినింటికి చెడ్డావు. నాకేం. కాస్సేపు పాలాల్లోకి వెళ్లానంటే అన్నీ మాంసపుముక్కలే', అని సమాధాన మిచ్చింది నక్క.

నక్క సమాధానం వినేసరికి రాణీకి మరీ ఖంగా రెత్తింది. "నా కథ నీ కెట్లా తెలుసు ?" అని నక్క నడిగింది.

"నీ కథే కాదు. నీ అటు మూడుతరాలు, ఇటు మూడుతరాలు ఏకరువు పెడతాను. కావలిస్తే విను" అంది నక్క. ఇకరాణికి మతిలేక నక్కని బ్రతిమాలుకోవడం మొదలెట్టింది, తనకీ గండం తప్పించమని.

నక్క కాసే పాలోచించి, "నాకోసాయం చేయాలి. అది చేస్తా నంటే చెప్తా"నంది.

"ఓ దానికేం, నాకీ గండం తప్పించావంటే నీకు వంటినిండా ముత్యాలు, రత్నాలు కురిపించేస్తాను" అన్నది రాణి.

అప్పుడు ఉపాయశాలిఐైన ఆ నక్క యీ విధంగా అలోచనచెప్పింది: "నువ్వు ఏట్లోదిగి కూర్చుని జుట్టు ముడివిప్పి విరబోసుకో. పిచ్చపిచ్చగా కేకలు వేస్తూ ఉండు. నీ కేకలువిని పట్టణంలో వాళ్ళంతా యిక్కడికి చేరుతారు. నీ హడావిడి చూసి నీకు పిచ్చెత్తిందనీ, ఏట్లోపడి కొట్టుకుంటూ కేకలు పెడుతున్నావనీ పుకారు పుట్టిస్తారు. ఈసంగతి రాజు చెవిని కూడ పడుతుంది. అప్పుడు



ఆయన నిన్ను తీసికెళ్ళి నీకు అనేక వైద్యాలుచేయిస్తాడు. ఎంతమంది వైద్యులు వచ్చినా నీవుమాత్రం రెచ్చిపోతూనేఉండు. నేను శుక్రవారం ప్రొద్దున్నే వో బ్రాహ్మణ్ణి పంపుతాను. ఆయన వచ్చి నీ చెవిలో 'నక్క పంపిన బ్రాహ్మణ్ణి' అని ఊదుతాడు. అంతటితో నీ పిచ్చ తగ్గిపోయినట్టు నటించు. ఇదే నీవు నాకు చెయ్యవలసిన సాయం. ఈ సాయం, యిప్పుడు చేస్తానని చెప్పి తర్వాత అలా చెయ్యకపోతే నిన్ను ఈ ఒక్క పట్టణమే కాదు. ఎక్కడా తలెత్తుకు తిరగటానికి లేకుండా చేస్తాను



జాగ్రత్త! తెలిసిందా?" అని చెప్పి వెళ్లిపోయింది నక్క. సరేనని రాణి జుట్టు విరబోసుకొని ఆ ఏటిలో కొట్టుకుంటూ పిచ్చి కేకలు మొదలెట్టింది.

తెల్లవారేసరికి ఈ వార్త ఆనోటా ఆనోటా పాకి కోటకు చేరింది, రాజుగారి భార్యకి పిచ్చెత్తిందనీ. ఏట్లోపడి కొట్టుకుంటోందనీ. రాజుగారి కిదితెలిసి తన భార్యకి నిజంగా పిచ్చెత్తిం దనుకొని పదిమంది దాసీల నిచ్చి మేనా పంపాడు. ఆ దాసీలు వచ్చి రాణీకి బట్టలుకట్టి మేనాలో యెక్కించి యింటికి చేర్చి గదిలో పెట్టి తాళంవేశారు.

గదిలో ఉండి మేడంతా దద్దరిల్లేటట్లు అల్లరిచేస్తోంది రాణి. వేళకి తిండితినదు. పిచ్చకేకలు. ఇవన్నీ రాజుకు మరింత ఖంగా రెత్తించాయి. ఎంతోమంది వైద్యులు వస్తున్నారు, చూస్తున్నారు. కాని ఏంలాభం! వైద్యులని చూచినకొద్దీ రెచ్చిపోయి వాళ్ళని కొట్టడం తిట్టడం కూడా చేస్తోంది. ఇది చూచి వైద్యంచెయ్యడానికి కూడా ఎవరూ రావడంలేదు. ఈలా నాలుగు రోజులు గడిచాయి. రాణీ పిచ్చతోపాటు రాజుకు బెంగకూడా ఎక్కువైంది.

ఆ నాడు శుక్రవారం. మామూలుగానే నక్కబావకు పంచాంగము చెప్పాడు బ్రాహ్మడు. నక్క రాణీతో చెప్పిన రోజు అదే. "ఓ బ్రాహ్మడా! నేను నీ కేమీ యివ్వకపోయినా, నీ విధి నీవు నెరవేరుస్తున్నావు. మన పట్టణం రాణీకి పిచ్చెత్తింది. నీవు వెళ్లి ఆ పిచ్చ బాగుచెయ్యి. నీకు కావలసినంత ధనం యిస్తాడు రాజుగారు. దాంతో నీ దరిద్రం తీరిపోతుంది" అని చెప్పింది నక్క.

ఆ మాట వినగానే ఆ పిరికిబాప డొక్కసారి ఉలిక్కిపడి "నాకేం మంత్రాలొచ్చా, తంత్రాలొచ్చా, పైగా ఆ పిచ్చది ఏ లెంపకాయన్నా కొట్టిందంటే నా పెళ్ళాం బిడ్డలకు నేను దూరమైపోతాను. నా కెందుకు!

నాదారిన నన్ను పోనివ్వు" అన్నాడు బ్రాహ్మడు.

"నీకు మంత్రాలేమీ రానక్కర్లేదు. రాణీదగ్గర కెళ్ళి ఆవిడ చెవిలో 'నక్క పంపిన బ్రాహ్మణ్ణి' అని చెప్పు. దాంతో పిచ్చి ఎగిరిపోతుంది" అని చెప్పింది నక్క.

నక్క మాటప్రకారం కోట గుమ్మం దగ్గరి కెళ్ళాడు బ్రాహ్మడు. లోపలి కెళ్ళ డానికి బంట్రోతులు ఆటకాయించారు. "నేను వైద్యం చేస్తాను. రాణీగారి పిచ్చ నేను కుదర్చకపోతే నన్ను మారు పేరెట్టి పిలవండి" అని డబాయించి మరీ వెళ్లాడు లోపలికి. తిన్నగా రాజుగారి దర్శనంచేసి వైద్యంచేయడానికి అనుమతి ఇవ్వవలసిన దని కోరాడు. ఏ పుట్టలో ఏ పాముందో అనుకొని రాజు ఒప్పుకున్నాడు.

మన బాపనయ్య రాణీ ఉన్న గది దగ్గర కెళ్లి చూసి కావలసిన ఏర్పాటు లన్నీ చేయించుకొన్నాడు. రాణీ తన మీదబడి కొట్టకుండా ముందుగా గొలుసువేయించి కట్టించేశాడు బ్రాహ్మడు. తనకి మంత్రా లొచ్చినట్టు నటించి హ్రాం, హ్రీం, హ్రూం అని ఏవేవో కొన్ని మంత్రాలు చదివి, ఎవళ్లూ లేకుండగా చూచి, గదితలుపులు దగ్గరగావేసి, రాణి దగ్గర కెళ్ళి మెల్లగా చెవిలో "నేను నక్క పంపిన బ్రాహ్మణ్ణి సుమా" అని ఊదేశాడు.



వెంటనే రాణీ తన పిచ్చకేకలూ, పిచ్చ పనులూ అన్నీ మానుకొంది. ఈసంగతి విన్న రాజుగారు ఎంతో ఆశ్చర్యపోయారు.

ఆమర్నాడు పెద్దసభ ఏర్పాటుచేయించి, ఎంతోమంది వైద్యులు కుదర్చలేకపోయిన పిచ్చను బ్రాహ్మడు కుదిర్చినందుకు రాజు గారు అతన్ని ఎంతో గౌరవించి. ఎన్నో ముత్యాలూ, రత్నాలూ, కెంపులూ, భూములు యిచ్చి సత్కరించాడు. నాటితో మన బ్రాహ్మడి దరిద్రం రెక్కలు వచ్చిన పిట్టలాగు ఎగిరిపోయింది.

చూశారా, చెల్లాయిలూ! నక్క బ్రాహ్మడి కెంత సాయంచేసిందో!



# అజ్ఞానశిరోమణి

అనగా అనగా ఒక ఊళ్లో ఒక రాజు వుండేవాడు. ఆయనపేరు అమాయకుడు. ఎవరైనా ఓ మంచోచెడ్డో చెప్పితే శాంతంగా వినేవాడు. ముఖ్యంగా చాడీకోరుమాటలు చెప్పేవారికే అగ్రతాంబూలం.

ఆయన మంత్రిపేరేమిటో తెలుసా? మాయకుడు. రాజూ మంత్రీకూడా సార్థక నాములే. మంత్రి ఒక్కొక్కప్పుడు రాజు గారినే పల్టీకొట్టించి పట్టం కట్టుకునేవాడు. పైకి చాలా మంచివాడులాగా వుండేవాడు.

రాజుగారి పశువుల కాపర్లలో అజ్ఞాన శిరోమణి అని ప్రత్యేకం దున్నపోతులను కాసేవాడు ఒకడు వున్నాడు.

ఒకనాడు అజ్ఞానశిరోమణి దున్నపోతు లను కాస్తూఉండగా కొంచెం దూరంలో వున్న గేదెల మందలోనుంచి లేగదూడ ఒకటి తప్పిపోయి పోతులమందలో కలి సింది. కొంతసేపటికి అజ్ఞానశిరోమణి యీ లేగదూడను చూచి "ఔరా, కాల మహిమ! దున్నపోతు ఈనింది" అని అను కొని ఈ వింతసంగతి రాజుగారికి నివే దించా లనుకున్నాడు.

తిన్నగా దున్నపోతును. లేగదూడతో సహా తోలుకొని రాజుగారి ఎదటికి వచ్చి, "ప్రభూ! మనమందలో దున్నపోతు ఈ లేగదూడని ఈనింది" అని మనవి చేసు కున్నాడు.

రాజుగారు ఎంతో ఆశ్చర్యపడి మంత్రి వంక చూచి, "మంత్రీ! చాలా విచిత్రంగా ఉంది" అన్నారు.

మంత్రికూడా "చిత్తం, చిత్తం, మహా రాజా! గత యుగాలలో ఏ మహారాజు పరిపాలనలో కూడా ఇలాంటిది జరగ లేదండి" అన్నాడు.

రాజుగారు ఈ వింతపశువులను కొంత సేపు కన్నుల కరువుదీరునట్లుగా చూచి దున్నపోతును దూడను కట్టివేయమన్నారు.

నరహరిశెట్టి వేంకటరావు, చిన్నాయపాలెం

# అవ్యక్తమహారాజు

పిమ్మట రాజుగారు ఈవింతవిషయాన్ని ప్రత్యక్షంగా నిరూపించిన అజ్ఞానశిరోమణికి మంత్రిసలహాపైన ఒక జాగీరుయిచ్చి గౌర వించారు.

* * *

కొన్నిరోజులు గడిచినై. ఒకనాటిరాత్రి కోటలో రాజు, మంత్రి కూర్చుని ఆమాటా, ఈమాటా మాట్లాడుకుంటున్నారు. అవి చీకటి రాత్రుళ్ళు. కోటకు ఒక ప్రక్క ఓ చిన్న ఏరు పారుతూ ఉంది. ఆ ఏటిఒడ్డున నక్కలు గుంపులు గుంపులుగా చేరి అర వడం మొదలు పెట్టాయి. ఖులాసాగా మాట్లాడుతున్న రాజుగారికి కోపం వచ్చి "ఏమోయ్, మంత్రీ! ఆ నక్కలు ఎందు కలా అరుస్తున్నాయి?" అని అడిగాడు.

"మహారాజా! ఇది శీతాకాలం. చలి ఎక్కువగా వుంది. చలిబాధకు తాళలేక అవి అలా అ రు స్తు న్నా యి" అన్నాడు మంత్రి.

"అవును పాపం, వాటికి కప్పుకోటానికి మనకుమల్లే దుప్పట్లులేవుగా!" అన్నాడు రాజు జాలిగా.

"చిత్తం, మహాప్రభూ! నోరులేనివాటికి దుప్పట్లు ఎవరు కొనియిస్తారు" అన్నాడు మంత్రి.



"ఒకరు కొనిచ్చేదేమిటి? మ న మే యిద్దాం. రేపు మన ఖజానాలోంచి రెండు వేల రూపాయలు తీసి దు ప్ప ట్లు కొ ని ఒక్కొక్క నక్కకు ఒక్కొక్కటి చొప్పున యిప్పించు" అన్నాడు రాజు.

మంత్రి సరేనన్నాడు.

తెల్లవారింది. మంత్రి ఖజానాలో నుంచి అంత డబ్బూ తీసి చక్కగా తన యింటికి పట్టుకువెళ్ళి తాళం వేసుకున్నాడు.

ఆ రాత్రి మళ్లీ మామూలుగానే రాజూ మంత్రీ కోటలో కూర్చున్నారు. నక్కలు మళ్లీ అరవటం మొదలుపెట్టాయి. ఇది వినేసరికి రాజుకి ఆశ్చర్యం క లి గిం ది.

"మంత్రి! దుప్పట్లుకొని పంచిపెట్టించావా?" అని అడిగాడు.

"చిత్తం. దేవర ఆజ్ఞప్రకారం అన్నిటికీ తలొక దుప్పటి యిప్పించాను" అన్నాడు మంత్రి.

"అలాగైతే మళ్లీ యీ నక్కలు అరుస్తున్నయ్యి ఎందుకు?" అన్నాడు రాజు.

"ప్రభువులు పొరబడుతున్నారు. తమరు దయచేయించిన దుప్పట్లు కప్పుకొని, అవి తమకు కృతజ్ఞతచూపుతూ తమ కీర్తిని యిలా గానం చేస్తున్నాయి" అన్నాడు మంత్రి.

నిజమేగదా అని సంతోషించాడా వెర్రి మహారాజు.

మంత్రికి క్రమంగా దురాశపుట్టింది. రాజ్యమంతా తానే కాజేయాలనుకున్నాడు.

ఒకనాడు మంత్రి రాజుతో యిలా అన్నాడు: "మహారాజా! శత్రురాజులు మన పైకి యుద్ధానికి వచ్చే సూచనలు కనపడుతున్నాయి. మనకు సైనికబలం తక్కువగా వుంది."

"మరైతే ఏదైనా మంచి ఉపాయం ఆలోచించు" అన్నాడు రాజు.

"నేను ముందే ఆలోచించాను. పూర్వం అర్జునుడు పరమేశ్వరునిగూర్చి తపస్సుచేసి పాశుపతాస్త్రము సంపాదించాడు. దేవర వారు కూడా అడవికెళ్లి తపస్సు చేసి అలాంటిఅస్త్రం ఒకటి సంపాదించినట్లయితే శత్రుసంహారం సులువుగా చేయవచ్చును. ఈ లోగా నేను కోటలో నుంచి ఎప్పటి కప్పుడు మీకు వార్తలు తెలియపరుస్తూ ఉంటాను" అన్నాడు మంత్రి.

ఈ మాటలు విని ఆ వెర్రి మారాజు తపస్సు చెయ్యటానికి అడవికి వెళ్లాడు. అక్కడ పాపం ఆయన్ని క్రూరమృగాలు చంపివేశాయి.

మంత్రి, రాజు చచ్చిపోయాడని తెలుసుకుని రాజ్యానికి తానే పట్టంకట్టుకున్నాడు. అజ్ఞానశిరోమణికి ఇదివరకు ఇచ్చిన జాగీరు తిరిగి లాగివేశాడు.

మరికొన్ని రోజులు గడిచిన తర్వాత శత్రురాజులు నిజంగానే యుద్ధానికి వచ్చి మంత్రిని ఓడించి ఆ రాజ్యం కాస్తా ఆక్రమించుకున్నారు.

చూశారా! వాడి అన్యాయం వాడినే కొట్టింది.



# మొండి నమ్మకం

అనగా, అనగా ఒక వూళ్ళో కందుల సుబ్బడు అనే బీదవా డొక డుండేవాడు. ఇతడు రోజూ దగ్గరలోవున్న అడవికిపోయి, కట్టెలు కొట్టుకొని, ఊళ్ళో అమ్ముకుంటూ జీవనం చేస్తుండేవాడు. పాపం! అతని దరిద్రానికి తగ్గట్టుగా, గంపెడు మంది పిల్లలుకూడా పుట్టారు. ఇంతమంది పిల్లల తోనూ, భార్యతోనూ ఎల్లాగో ఒక గుడిసెలో కాపురం చేస్తున్నాడు.

ఇల్లా కొన్ని సంవత్సరాలు గడచి పోయాయి. మామూలుగా వాడొక రోజు అడవికిపోయి కట్టెలు కొట్టుకుంటున్నాడు. కొట్టగా, కొట్టగా, ఆ చెట్టులో ఒక తొఱ్ఱ బైట పడింది. అందులో కొన్ని చీమలు కనిపించినై. వాటిముక్కులను నూకలు. ఇది చూసిపాపం! సుబ్బడు విస్తుపోయి ఇలా అనుకున్నాడు.

"అరే! ఈ కారు అడవిలో ఈ చెట్టు తొఱ్ఱలోనున్న చీమలకు ఆహార మిచ్చిన దేవుడు, నా కెందు కివ్వడు? ఈ రోజు మొదలుకొని నేనూ ఇంట్లో కూర్చుంటాను. ఈ చీమలకు ఆహారమిచ్చిన దేముడు, నాకూ, నా భార్యా పిల్లలకు మాత్రం ఆహారం ఎందుకివ్వడో చూస్తాను" అని అనుకుంటూ యింటికి పోయి కాళ్లు ముడుచుకుని పడుకున్నాడు. ఇంట్లో డబ్బు లేదు. భార్య గోలపెట్టింది "డబ్బులేదండి" అంటూ.

"డబ్బా! చీమలదేముడు తెస్తాడు" అంటూ కూర్చున్నాడు కందుల సుబ్బడు.

ఇదంతాచూచి, భార్య కేమీ తోచక, పిల్లల్ని పెంచటానికి, రోజూ అడవికి వెళ్లి, ఎఱ్ఱమన్ను త్రవ్వి అమ్ముకుంటూ కాల క్షేపం చేస్తున్నది. ఇలా, కొన్నాళ్లు గడచి పోయింది.

యమ్. సత్యనారాయణరావు, పొన్నూరు.





సుబ్బడి భార్య, మామూలుగా ఒక రోజున అడవికి వెళ్ళి, ఎర్రమన్ను త్రవ్వుతుండగా, ఏదో 'ఠ'క్కుమని తగిలింది. ఏమా ? అని త్రవ్వి చూసేటప్పటికి, ఒక బిందె, బిందెనిండా కాసులూ కనపడినై. అవన్నీ నెత్తినపెట్టుకు పోదామని మొదట్లో అనుకుంది. కాని, కాస్సేపాలోచించి "అమ్మయ్యో! పట్టపగలు ఎవరు చూస్తే ఏమోనమ్మా! నమ్మరాదు" అనుకుంటూ ఆ కాసులు ఒక పెద్ద తట్టలోపోసి, పైన మూరడెత్తున ముళ్ళుపెట్టి, గండుచీమలు, తేళ్ళు అందులో పడేసి ఇంటికి వెళ్ళింది.

క్రమంగా ప్రొద్దుకూకి చీకటిపడ్డది. రాత్రి పదిగంటలైంది. అప్పుడు సుబ్బడి భార్య, భర్తదగ్గిరికి వెళ్లి "ఏమండీ! అడవిలో నాకొక కాసులబిందె దొరికింది. ఆ కాసులన్నీ అక్కడొక తట్టలో పెట్టొచ్చాను. తీసుకొద్దాం పదండి. మన దరిద్రం తీరుతుంది" అన్నది.

చెప్పిందంతా విని సుబ్బడు "చీమల దేముడే తెస్తాడు" అని బండలా కూర్చున్నాడు. భార్య ఎంతబ్రతిమాలినా కదల్లేదు.





ఈ సంభాషణ ప్రక్కయింటికి కన్నం వేద్దామని వచ్చిన దొంగలు విన్నారు. విని, వినడంతోటే " పదండిరా, " అని చంకలు కొట్టుకుంటూ ఆ మనిషిచెప్పినచోటికి వెళ్లి తట్టలోచెయ్యి పెట్టేటప్పటికి, చీమలూ, తేళ్లూ తెగకుట్టి వదిలిపెట్టినై.

అప్పుడు "అబ్బా! ఈ మాయలమారి మనల్ని మోసంచేసిందిరా; దీని రోగం కుదురుద్దా"మని ఆతట్ట తీసికెళ్లి ఆ గుడిసె పైన పెద్ద బొక్కపెట్టి దాంటో కుమ్మరించి పారిపోయారు. ముందు చీమలూ, ముళ్లూ, తేళ్లూపడ్డయ్. ఆతరువాత గలగల మంటూ కాసులన్నీ పడ్డయ్. ఇదిచూసి సుబ్బడూ, సుబ్బడి భార్య ఆశ్చర్యపోయారు.

" చూశావా! నేను చెప్పలేదా చీమల దేముడే తెస్తాడని " అంటూసుబ్బడు లేచి గంతులు వెయ్యటం మొదలెట్టాడు. ఆ



తరువాత, సుబ్బడు ఆడబ్బుతోనూ, భార్యా బిడ్డలతోనూ హాయిగా పూలరంగడులా కాలం వెళ్ళబుచ్చ సాగాడు.

మీరుమాత్రం చీమల దేముడే తెస్తాడని కూచోకండేం! ఆకలయితే అన్నం పెట్టమని మీ అమ్మ నడగండి.





# దొంగ సన్యాసి



(గతసంచిక తరువాయి)

మూడో ఏడు పూర్తిఅయిన మర్నాడు సన్యాసి మళ్లీ రాజు ఎదట ప్రత్యక్షమయ్యాడు. అన్నమాటను నెరవేర్చమని రాజును అడిగాడు.

అప్పుడు రాజుకి "ముగ్గురిలో ఎవరెవరిని యివ్వటమా?" అని సందేహం కలిగింది. రాణిని సలహా అడిగాడు.

"మన తర్వాత మన పెద్దకుమారుడే కదా వారసుడు! అందుకని వాడిని యివ్వటానికి వీల్లేదు. మన పెద్దవాడికికూడా మనలాగే సంతానం కలగకపోతే, అప్పుడు మన రెండోవాడేగదా వారసుడు. కనక వాడినికూడా యివ్వటానికి వీల్లేదు. అందువల్ల ఎటొచ్చీ మనం యిచ్చుకోగలిగిందల్లా ఆఖరివాడినే. అలాగే గుఱ్ఱప్పిల్ల కుక్కపిల్లల విషయంలోకూడా చేద్దాం." అని సలహా చెప్పింది రాణి. సరేనని రాజు తన మూడో కుమారుణ్ణి, మూడోగుఱ్ఱప్పిల్లనీ, కుక్కపిల్లనీ సన్యాసికి సమర్పించి సాగనంపాడు.

ముందు సన్యాసి, అతని వెనకనే గుఱ్ఱం మీద రాజకుమారుడు, గుఱ్ఱం వెనకనే కుక్క బయలుదేరారు. వాళ్లు అలా పోయిపోయి చివరికి ఒక ఎత్తైన కొండ మీదికి చేరుకున్నారు. కొండ దిగువన ఒక లోయా, ఆ లోయలో ఒక కోటా వున్నయ్. సన్యాసి ఆ కోటను చూపుతూ రాజకుమారుడితో అన్నాడు — "ఆ కనిపించేదే నా యిల్లు. నేను నిన్ను యిప్పుడు ఈ కొండమీదనే వదిలి వెడతాను. నువ్వు నా యింటికి చేరుకోవాలి. నా యింటి బైటి వాకిలిదగ్గిర ఒక మేక కట్టివేసి ఉంటుంది. ఆ దగ్గర్లోనే ఒక గడ్డిమోపు వుంటుంది. నువ్వు ఆ గడ్డిమోపును మేక

బి. వేణుగోపాల్ — మద్రాసు



ముందు వెయ్యాలి. ఇది మొదటి పని. ఈ పని చేసిగాని నువ్వు యింటి అవరణలో అడుగు పెట్టగూడదు.

"ఈపని చేసి నువ్వు యింటి ఆవరణలోకి వెడితే అక్కడ నీకు కొన్ని కోళ్ళు కనిపిస్తవి. ఆ దగ్గర్లోనే కొంత ధాన్యం వుంటుంది. నువ్వు ఆ ధాన్యం కోళ్ళ ముందు చల్లాలి. ఇది రెండో పని.

"ఈ రెండుపనులూచేసి, నేను తిరిగి వచ్చేవరకూ నాయింట్లో ప్రవేశించకుండా బైటి ఆవరణలోనే కనిపెట్టుకు వుండాలి. అలా గాకుండా యింట్లో ప్రవేసించబోయావంటే నువ్వూ, నీ గుఱ్ఱం, నీ కుక్కా ముగ్గురూ ఒక్కసారిగా చస్తారు" అని చెప్పి సన్యాసి కొండదిగి త్వరత్వరగా వెళ్లిపోయాడు.



పాపం, రాజకుమారుడికి ఏంచెయ్యాలో తోచలేదు. ఏదారినపోతే సన్యాసి యింటికి చేరుకోగలడో తెలియలేదు. కాని, దేవుడిమీద భారంవేసి బయలుదేరాడు. దారిలో ఎన్నో గుట్టలు, మిట్టలు, వాగులు దాటవలసి వచ్చింది. చాల కష్టాలుపడి అన్నీ దాటాడు.

అలాగే మరి కొంతదూరం వచ్చేసరికి రాజకుమారుడి దారికి ఒక వెడల్పాటి కాలవ అడ్డువచ్చింది. కాలవకి అవతలివైపు కొంతదూరంలో కోట కనిపించింది. కోట కనిపించేసరికి రాజకుమారుడికి మనస్సు స్థిమిత పడింది. కాని కాలవ దాటటం ఎట్లా? కొంతసేపు ఆలోచించాక రాజకుమారుడికి ఒక ఉపాయం తట్టింది. తను గుఱ్ఱంమీద ఎక్కాడు. కుక్కని ఒళ్లో కూర్చొపెట్టుకుని గుఱ్ఱాన్ని అదలించాడు. గుఱ్ఱం వాయువేగంతో కాలవ అవతలి ఒడ్డుకు దూకింది. కాసేపు విశ్రాంతి తీసుకుని రాజకుమారుడు కోట వాకిలి దగ్గరికి పోయాడు.



సన్యాసి చెప్పినట్లుగానే కోట గుమ్మం దగ్గిర ఒక మేక, ఆ దగ్గర్లోనే ఒక గడ్డి మోపూ కనిపించినై. రాజకుమారుడు గడ్డిమోపు మేకముందు పడేశాడు. మోపు కింద పడీ పడటంతోటే అది మూడు తోడేళ్ళుగా మారింది. రాజకుమారుడి వెంటవున్న వేటకుక్క ఒక్కసారి ఆ తోడేళ్లమీదికి దూకింది. మూడు తోడేళ్లూ అమాంతం మేకమీదపడి దాన్ని నోట కరుచుకొని వెనక్కి తిరిగిచూడకుండా కొండవైపుకు పరిగెత్తిపోయినై.



తర్వాత రాజకుమారుడు యింటి ఆవరణలో ప్రవేశించాడు. సన్యాసి చెప్పినట్లు గానే అక్కడ మూడు కోళ్లూ, ఆ దగ్గర్లోనే ధాన్యం కనిపించాయి. రాజకుమారుడు ధాన్యం కోళ్లముందు చల్లాడు. ధాన్యం నేలమీద పడటంతోటే మూడు పిల్లులుగా మారింది. కుక్క మళ్లీ వాటిమీదికి దూకింది. మూడు పిల్లులూచేరి కోళ్లని నోటకరచుకుని కొండవైపుకు పరిగెత్తిపోయినై.

పై రెండు వింతలూ చూసేసరికి రాజకుమారుడికి కోటలో ప్రవేశిస్తే ఏమి వింత జరుగుతుందో కూడా తెలుసుకోవాలని కుతూహలం కలిగింది. కాని 'ముగ్గురూ ఒక్కసారి చస్తారు!' అని సన్యాసి భయపెట్టటంవల్ల రాజకుమారుడికి కోటలో ప్రవేసించటానికి మొదట ధైర్యం చాలలేదు. కాని అంతకంతకీ, ఏమి వింత జరుగుతుందో తెలుసుకోవాలనే కుతూహలం జాస్తి కాసాగింది. అందువల్ల, "ఏమౌతే అది అవుతుంది" అని ధైర్యం తెచ్చుకుని రాజకుమారుడు గుఱ్ఱాన్నీ కుక్కనీ ఆవరణలో వదిలి కోటలో ప్రవేశించబోయాడు.






రాజకుమారుడు కోటతలుపు తోసి లోపల ప్రవేశించాడు. అది ఒక పెద్ద విశాలమైన మహలు. అంతాచీకటి గబ్బ గయ్యంగా వుంది. కన్ను పొడుచుకున్నా దారి ఏమాత్రం కనిపించటంలేదు. ఐనా రాజకుమారుడు తడువుకుంటూ ధైర్యంగా నడక సాగించాడు. అలా పోగా పోగా చివ రికి అతనికి ఒక గది కనిపించింది. గది తలుపులు వేసివున్నయ్. కాని తాళంవేసే బెజ్జంలోంచి సన్నని కాంతి బయటికి వస్తోంది. ఆ కాంతివల్ల దారి యిప్పుడు కొంచెం తెలుస్తూవుంది. రాజకుమారుడు ఎకాఎకిని గదితలుపు తోసుకుని లోపల ప్రవేశించాడు. గదిలో ఒక హంసతూలికా తల్పం వుంది. దానిమీద ఒక అప్సరస లాటి కన్య నిద్రపోతూ వుంది. రాజకుమా రుడు ఆమెని లేపుదామని కాలితో నేల మీద తన్ని చప్పుడు చేశాడు. కాని ఆమె లేవలేదు. రాజకుమారుడు దగ్గరికిపోయి మీద చెయ్యివేసి లేపాడు. కాని ఆమె లేవ లేదు. మరోసారి గట్టిగా తట్టి చూశాడు. అప్పటికీ ఆమె లేవలేదు. ఇంతలో రాజ కుమారుడి దృష్టి ఆ కన్య చెవిలో వున్న ఒక తెల్ల గులాబిపువ్వుమీద పడింది. రాజకుమారుడు ఆ పువ్వును తీశాడు. పువ్వు తీసివెయ్యగానే ఆ కన్య ఒక్కసారిగా లేచి కూర్చుంది. రాజకుమారుడూ, ఆమె ఒక్కనిమిషం ఒకరినొకరు ఆశ్చర్యంగా చూసుకున్నారు.

తర్వాత ఆమె రాజకుమారుణ్ణి అడిగి అతనక్కడికి ఎలా వచ్చిందీ, ఏమి జరి గిందీ అంతా తెలుసుకుంది. తర్వాత రాజకుమారుడు ఆమెని తన సంగతి చెప్ప మనికోరాడు. అప్పుడు ఆమె ఇలా చెప్పటం మొదలెట్టింది.



"నిన్ను ఇక్కడికి తీసుకొచ్చిన సన్యాసి నిజానికి సన్యాసి కాడు. అతనొక మాయల మారి రాక్షసుడు. అతను మనుష్యుల గుండెకాయలను తిని జీవిస్తాడు. ఏమని షిని బడితే ఆ మనిషిని చంపలేడు. అతను చెప్పినపని ఎవరైతే చెయ్యము అని అంటారో వాళ్లనే అతను చంపగలడు. అతను చెప్పేపనులు చాల భయంకరము గానూ, కష్టంగానూ వుంటైగనుక ఎవరూ చెయ్యమంటారు. అట్లా అన్నవారిని చంపి వాళ్ల గుండెకాయ తింటాడు. ఒకవేళ ఎవరైనా అతను చెప్పినపని చెయ్యగలిగారంటే, వాళ్ళకు యింకోపని, అదిచేస్తే యింకోపని, యిలా ఒకదానికంటే ఒకటి కఠినంగా వుండేపనులు చెబుతాడు. ఇన్ని పనులలో ఏదో వకపనిఅయినా ఆ వచ్చిన వాళ్లు 'మేము చెయ్యము' అనేటంత భయంకరంగా వుంటుంది. వాళ్ళు అలా అనగానే అతనికి వాళ్లని చంపగలశక్తి వస్తుంది. ఇప్పటికి చాలామంది దురదృష్ట వంతులు యితని చేతులో చనిపోయారు. నేను కూడా ఒక గొప్ప రాచబిడ్డనే. నీ మాదిరిగానే నన్ను కూడా ఈ రాక్షసుడు నా తలిదండ్రుల దగ్గర్నించి తెచ్చాడు. కాని, నా అదృష్టవశాత్తు అతనికి నా మీద ప్రేమ కలిగింది. అందుచేత అందర్నీ చంపినట్లు నన్ను చంపలేదు. అతను బైటికి వెళ్లేటప్పుడు ఈ తెల్ల గులాబిపువ్వు నా చెవిలో పెడతాడు. అదికూడా ఒక మాయ పువ్వే. అది నాచెవిలోపెట్టగానే నేను ఒళ్లు తెలియకుండా యిలా పడుకుండిపోతాను. అతను మళ్లీ తిరిగివచ్చి పువ్వు తీసేవరకూ యిలాగే పడుకుంటాను. ఇంక కాసేపట్లో అతను తిరిగివస్తాడు. అతను వచ్చేసరికి నువ్వు పువ్వును నా చెవిలోపెట్టి, నీవు వెళ్లి మళ్లీ బయటిఅవరణలో కూర్చునివుండాలి. ఇకపో," అని చెప్పింది.

[ఇంకా వుంది]



# బాలగేయాలు

సంపాదన :

వెలగా రామకోటయ్యచౌదరి, మాచవరం

1

సిరిసిరివానలు కురియంగా
సీతాదేవి పుట్టంగా
రావణాసురుని తలగొట్టంగా
రంగులరాట్నం తిరగంగా

2

దిబ్బగుంటలో తిరణాలంట
డబ్బుకి మానెడు శనగాలంట
ఆడపిల్లకు అద్దాలంట
మొగపిల్లోడికి మొలత్రాడంట
చంకపిల్లకు టెంకాయంట
కడుపులో పిల్లకు కరక్కాయంట

3

ఏటిఅవతల ఎర్రజొన్నకర్ర
వచ్చే పోయే పసియావు మేసె
పసియావు కడుపున చార్లపెయ్య
చార్లపెయ్యకు పండ్లేలేవు
అల్లా రల్లారే.

48-వ పేజీలోని పొడుపు పద్యములకి జవాబు

1. గుడిలో గంట; 2. పాలు

# చందమామ పజిల్

(భాషాభివృద్ధికి)

## ఆధారములు

### అడ్డము :

1. చివర
3. కెరటము
5. పెండ్లి కొమారుడు
7. చెయ్యి
9. మింగటంలో ఒకరకం
11. మనముతలకు రాచుకునేది
13. గడ్డి - గాదం
15. నటించేవాడు
16. పసిపిల్లలకు - ఇవి తప్పక కావాలి
17. క్రూరమృగము




### నిలువు :

2. పగలు
3. పాదము
4. ఒక సాధు జంతువు
6. వచ్చుట
8. ధ్వని
10. టపాకాయలు
11. మూడుకాలాల్లో ఒక కాలము
12. మనుష్యులు (కలగూరగంప)
13. శరీరంలో ఒకభాగము
14. వడ్రంగి పనిముట్టు



# గుండ్రకొమ్ముల అనుమానం



పూర్వం ఒకవూళ్లో ఒకదాసరి వుండేవాడు. అదాసరి తలబోడి. దాసరి రోజూ ప్రొద్దున్నే ముష్టికి బయలుదేరి వూళ్లోవీధులన్నీ తిరిగి ఆ వచ్చినదానితో బ్రతుకుతూండేవాడు.

దాసరి యిలా ముష్టికి వీధుల వెంబడి వెళుతుండేటప్పుడు ఒకవీథిలో గుండ్రంగా వంపుతిరిగిన కొమ్ములున్న గేదె ఒకటి కనిపించేది. ఆ గేదెకొమ్ములని చూడగానే దాసరికి ఒకసందేహం కలుగుతూవుండేది. "ఈ గేదెకొమ్ముల మధ్యవున్న గుండ్రని ఖాళీస్థలం పెద్దదా? లేక నా బోడి తల పెద్దదా?" అని. అయినామళ్లీ, "ఏది పెద్దదైతే నాకేంలే" అని తనకితాను సమాధానం చెప్పుకుని మరోవీధికి వెళ్లిపోయేవాడు.

కాని, ఆ వీథికి ముష్టికి వెళ్ళగానే దాసరికి ఆ గేదె కనిపించేది. మళ్ళీదాసరికి అదే సందేహం కలుగుతూవుండేది.

ఒక రోజున దాసరి అనుకున్నాడు. "ఏమిటి నాకీ అనుమానం? ఇదేదో, తేల్చుకుంటేగాని బాగుండేటట్లు లేదు." ఇలా అనుకుని ఆచుట్టుప్రక్కల కూడా ఎవరూ చూడటంలేదనే ధైర్యంతో దాసరి తన బోడితలని ఆ గేదె గుండ్రని కొమ్ముమధ్య వున్న ఖాళీస్థలంలోకి నెమ్మదిగా ఇరికించాడు. ఇంకేముంది? గేదెకాస్త బెదిరి పరిగెత్తసాగింది. పాపం, దాసరితల కొమ్ములో చిక్కుకొంది.

తల బైటికి లాక్కోవాలని దాసరి ఎంతో ప్రయత్నించాడు. కాని ఏమీ లాభంలేకపోయింది. ఇక ఏమి చెయ్యటానికీ తోచక దాసరి బాధతో "అమ్మోయ్! బాబోయ్!" అని అరవటం మొదలెట్టాడు.

ఈ కేకలు విని ఆ చుట్టుప్రక్కలవారంతా అక్కడికి పోగయ్యారు. దాసరి

కొడుకుల నారాయణ, నర్సిపట్నం



అవస్థ చూచేసరికి వాళ్లకి నవ్వూ వచ్చింది. జాలీకలిగింది. అంతాచేరి మెల్లిగా దాసరి తలని కొమ్ము మధ్యనించి బైటికి తీశారు. బ్రతుకు జీవుడా అనుకొని దాసరి కాసే పటికి తెప్పరిల్లుకున్నాడు.

అప్పుడు వచ్చినవారంతా దాసరి చుట్టూ చేరి "ఏమయ్యాదాసరీ!ఇలా నీతల ఈ గేదె కొమ్ములమధ్య కెందుకని ఇరుక్కుంది?" అని అడిగారు.

"ఆ, ఏముందిబాబూ! దీనికంతా నా 'గుండ్రకొమ్ముల అనుమానం' కారణం" అని చెప్పి యింక అక్కడ ఒక్క క్షణం నిలిస్తే తనకి తాటాకులు కట్టకమానరని వెనక్కి తిరిగి చూడకుండా వెళ్లిపోయాడు.

వచ్చినవారంతా దాసరి తెలివి తక్కువకి కడుపు చెక్కలయ్యేటట్లు నవ్వి ఎవరిళ్లకు వాళ్లు చేరుకున్నారు.

అప్పట్నించీ, అనవసరమైన విషయాల్లో జోక్యం కలిగించుకొని అవస్థలుపడేవాళ్లని చూస్తే ఆ వూళ్లోవాళ్ళకి దాసరిసంగతి గుర్తుకొచ్చి, "ఎందుకయ్యా నీకి గుండ్రకొమ్ముల అనుమానం?" అంటుండేవారు.

మీరూ అలా అనవసరమైన పనుల్లో జోక్యం కల్గించుకుంటే మిమ్మల్నీ అలాగే అంటారు. కనక మీరు అనవసరమైన పనుల్లో జోక్యం కల్గించుకోకుండా ఉంటే దా స రి లా గా అ వ స్థా పడరు, ఒకరు మిమ్మల్ని ఏమీ అననూ అనరు.



## పొడుపు పద్యములు

1

కడుపులోని నాల్క - కదలి చెప్పుచునుండు
దేవుడుండు చోటు - తెల్లముగను
విప్పి చెప్పు వెదకి - విజ్ఞానమంతయు ?
పందెమిత్తువేయి - చందమామ !

(సంపాదన : చిల్లా వెంకటనరసింహులు, కడప)

2

నీట ముంచిన, తనయందు నీరు పోయు
రూపమొకటియె చవిచూడ రుచియు వేరు
వడతి యిచ్చును, మరియును పత్రమొసగు
చెప్పు ? చూతు నేనెవరినో చందమామ !

(సంపాదన : చావలి లీలావతి, చెరుకుపల్లి)

(జవాబులు 45-వ పేజీలో చూడండి)

### పజిలుకు జవాబు

| ■ | 1 తు | 2 ది | ■ | 3 అ | ల | ■ |
|---|---|---|---|---|---|---|
| 4 మే | ■ | 5 వ | రు | డు | ■ | 6 రా |
| 7 క | 8 ర | ము | ■ | 9 గు | 10 ట | క |
| ■ | వ | ■ | ■ | ■ | పా | ■ |
| 11 చ | ము | 12 రు | ■ | 13 క | సు | 14 వు |
| లి | ■ | 15 న | టు | డు | ■ | లి |
| ■ | 16 పా | లు | ■ | 17 పు | లి | ■ |

పక్క పేజీలోని చిక్కుబొమ్మలకి జవాబు
3, 6, నెంబర్లు గల బొమ్మలు రెండు ఒక రకం

## 'చందమామ'కు రచనలు పంపేవారంతా ఇది ముఖ్యంగా గమనించాలి

★

'చందమామకు' రచనలు పంపదలచిన వారు ఇకముందు మూడుకాన్ల పోస్టుబిళ్ళ అంటించి పంపనక్కర్లేదు. మీరు పంపిన రచన మాకు నచ్చి, మేము ప్రచురింప దలచుకుంటే, ఆ సంగతి రచన మాకు చేరినతర్వాత 15 రోజులలోపల మీకు తెలియజేస్తాము. అలా 15 రోజుల లోపల మావద్దనుంచి మీకు ఏవిధమైన జవాబూ రాకపోతే మీరు పంపిన రచన ఏదో ఒక కారణంచేత మాకు నచ్చలేదనీ, మేము అంగీకరించలేవనీ మీరు తెలుసుకోవలసి వుంటుంది. అంగీకరింపబడని రచనలు ఏవిధంగానూ త్రిప్పిపంపలేము. కనక, మీరే మీ రచనకు రెండు కాపీలు వ్రాసుకుని ఒక కాపీ మాకుపంపి రెండో కాపీ మీ వద్ద ఉంచుకోటం మంచిది.

పై విషయాలు చందమామ రచయితలందరూ ఇకముందు ముఖ్యంగా గుర్తుంచుకోవలసిందిగా కోరుతున్నాము.

— సంచాలకుడు.



















## అబ్బాయిలూ, అమ్మాయిలూ!

పైనవున్న ఆరు బొమ్మలూ ఒకేలా వున్నట్టు కనిపిస్తున్నయ్యికదూ? కాని అలా లేవు. ఆరింటిలో నాలుగు ఒకరకం, రెండు ఒకరకం. అవి ఏవో కనుక్కోండి. మీరు కనుక్కోలేకపోతే జవాబుకు ముందుపేజీలో చూడండి.

ఆగస్టు 19 నుండి ఆంధ్రదేశంలో ప్రదర్శింపబడుతోంది

★  ★


ఆంధ్రుల అభ్యున్నతతార "వరలక్ష్మి" మొదలగువారు
నటించిన అపూర్వమైన నృత్యములుగల చిత్రం.

విడుదల కేంద్రాలు:

| | | | |
|---|---|---|---|
| విజయవాడ | — సరస్వతి, లీలామహల్ | తెనాలి | — రత్నా |
| విశాఖపట్టణం | — మినర్వా | ఏలూరు | — పాండురంగా |
| కాకినాడ | — మినర్వా. | కర్నూలు | — చాంద్ |

డిస్ట్రిబ్యూటర్సు:

ఛెమ్పియా టాకీ డిస్ట్రిబ్యూటర్సు :: విజయవాడ, & గుంతకల్లు

# 1000 శిరశ్ఛేద అపూర్వ చింతామణి

## మాడరన్ థియేటర్సువారి తమిళ చిత్రం కథ

విద్యావంతుడు, ప్రాజ్ఞుడు, కామపిపాసి అయిన ఒక వ్యక్తి అష్టమసిద్ధి పొందటానికి పూజ చేస్తాడు. ఆదిత్యపురం రాజకుమార్తె చింతామణిద్వారా వెయ్యమంది తలలు తనకి బలి యిప్పించినట్లయితే ఆ కోర్కె ఫలిస్తుందని ఒక భూతం పలుకుతుంది. సన్యాసి వేషంతో ఆ వ్యక్తి ఆదిత్యపురం వస్తాడు.

తెలివిగలది, అందగత్తెఅయిన చింతామణి తనకుతగిన గురువుకోసం వెదికిస్తూవుంటుంది. ఆ సమయంలో యీ కపటసన్యాసి చింతామణికి గురువవుతాడు. చింతామణి మేనమామ పురందిరన్ చింతామణిని వివాహమాడాలని కుతూహలపడతాడు. చింతామణి తండ్రి అందుకు అంగీకరిస్తాడు. విద్యావంతుడు, ప్రతిభాశాలి, రూపవంతుడు అయిన రాజకుమారుణ్ణి వివాహం చేసుకోవాలంటే తను వేసే మూడుప్రశ్నలకి సరైన సమాధానం చెప్పినవానినే వివాహ మాడుతాననీ చెప్పలేనివారి తలలు బలియివ్వాలనీ ప్రతిజ్ఞపూనమని గురువైన కపటసన్యాసి తన శిష్యురాలిని ఆదేశిస్తాడు. ఈ కపటసన్యాసి కపటనాటకానికి గురై ప్రశ్నలకు జవాబులు చెప్పలేక తొమ్మిదివందల తొంభై తొమ్మిదిమంది రాజకుమారులు బలి అవుతారు.

కైవల్యపురం యువరాజు మెయ్యకహన్‌కి తన ఆరుగురుసోదరులు చింతామణి ప్రశ్నలకు జవాబులు చెప్పలేక బలి అయినారన్న విషయం తెలిసి చింతామణిపైన పగతీర్చుకుంటానని ప్రతిజ్ఞచేస్తాడు. మెయ్యకహన్ తన స్నేహితుడు కాశిని వెంటబెట్టుకుని ఆదిత్యపురం చేరు కుంటాడు. చింతామణి ఉద్యానవనంలో తోటమాలీలుగా వారిద్దరు ప్రవేశిస్తారు.

అవంతీ రాజకుమార్తె శంకమలం తల్లి దండ్రులను విడిచి చింతామణితోనే కాలం గడుపుతూ వుంటుంది. మెయ్యకహన్ శంకమలం మధ్య ప్రేమబంధం ఏర్పడుతుంది. చింతామణి మూడు ప్రశ్నలు ఏమిటో వాటికి జవాబులేమిటో కనుక్కొని చెప్పమంటాడు శంకమలాన్ని తోటమాలివేషంలో వున్న మెయ్యకహన్. మదివదనపురం, సంపంగిపురం, నడిశీలపురం అనే మూడునగరాల్లోను ఆ మూడుప్రశ్నలకు జవాబులు తెలుస్తాయని శంకమలంచెపుతుంది.

తనస్నేహితుడు కాశితోసహా మెయ్యకహన్ మదివదనపురం చేరుకుంటాడు. మదివదనపురం రాజుకి ఒక సన్యాసిచేసిన అపచారం గురించిన కథ విని చింతామణి గురువు అయిన కపట సన్యాసే అతడని తెలుసుకుని, చింతామణి మొదటిప్రశ్నకు జవాబు చెప్పమని మదివదనపురం రాజు అయిన సత్యశీలుని కోర్తాడు మెయ్యకహన్. మిగత రెండు ప్రశ్నలకు జవాబు తెలును కునేందుకు, సత్యశీలునితోసహా మెయ్యకహన్ సంపంగిపురం చేసుకుంటాడు. చింతామణి గురువు సంపంగిపురం రాజుకు కూడా అపచారంచేసిన విషయం తెలుసుకుని సంపంగిపురం రాజుతో నడిశీలపురంచేరుకుంటాడు. చింతామణి గురువు నడిశీలపురం రాజుకుకూడా ద్రోహం చేశాడనేవిషయం తెలుసుకుని యీ ముగ్గురు రాజులు, మెయ్యకహన్ ఆ కపటసన్యాసిపైన పగతీర్చుకోటానికి ఆదిత్యపురంకి వెళతారు.

గుహలోపల సన్యాసి, గుహబైట చింతామణి వుండగా వీరందరు వెళ్ళి చింతామణిని ప్రశ్నలడగమని జవాబులు చెపుతారు. కపటసన్యాసి కపటనాటకం వెల్లడవుతుంది. చింతామణి ప్రశ్నలకు జవాబులు చెప్పలేక సన్యాసి కపట నాటకానికి గురియై బలికాబడ్డ 999 రాజ కుమారులకు పునర్జన్మ యివ్వమని నడిశీలపురంరాజు సన్యాసిని ఆజ్ఞాపిస్తాడు. 999 మందికి ప్రాణంపోస్తాడు కపటసన్యాసి. వెంటనే సన్యాసిని తుదముట్టిస్తారు. చింతామణి బలిగొన్న వెయ్యోజీవం కపటసన్యాసి. శంకమలాన్ని మెయ్యకహన్ వివాహమాడుతాడు. పునర్జన్మ కలిగిన చింతామణి మేనమామ పురందిరన్ చింతామణిని వివాహమాడుతాడు.

---

మూడు పట్టణాల్లోను సన్యాసికావించిన దురంతాలకథలు చిత్రంలో సమగ్రంగా చూపబడుతవి.

Printed and Published by B.N. REDDI, at B. N. K. Press, 37, Acharappan Street, Madras
Editors: CHAKRAPANI and K. RAJA RAO

సెప్టెంబరు 25-న ఆంధ్రదేశపు ముఖ్యకేంద్రాల్లో విడుదల

పూర్ణా రిలీస్







జుపిటర్

# అభిమన్యు

(తమిళం)


YUVA PUBLICATIONS
MADRAS & BEZWADA

3 కోట్ల ఆంధ్రులకు 3 ఉత్తమ పత్రికలు

నేడే చందాదారులుకండి!

# చందమామ

పిల్లలకు

సాలుచందా 5-0-0
రెండేండ్లకు 9-0-0

# యువ

యువ విద్యార్థులకు

సాలుచందా 3-0-0
రెండేండ్లకు 5-0-0

# ఆంధ్రజ్యోతి

పెద్దలకు

సాలుచందా 5-8-0
రెండేండ్లకు 10-0-0

ఆఫీసు

పోస్టు బాక్సు నెం. 1686 :: మద్రాసు-1

## త్వరలో ఆంధ్రదేశంలో విడుదల!



రాగిణీ వారి

# భక్త జనా

తమిళం

తారాగణం : శాంతకుమారి, నాగయ్య
హొన్నప్ప భాగవతార్, సారంగపాణి మొదలైనవారు.

డైరెక్టర్.. పి.పుల్లయ్య బి.ఏ

| | |
|---|---|
| విజయవాడ - సరస్వతి పిక్చర్ పాలెస్ | గుంటూరు - సరస్వతీ టాకీస్ |
| విజయనగరం - శ్రీ కృష్ణా సినిమా | బందరు - మినర్వా టాకీస్ |
| రాజమహేంద్రవరం - జయా టాకీస్ | బళ్లారి - గ్రాండ్ థియేటర్ |

ఇంకా తదితర కేంద్రాల్లో విడుదలకి ఎదురుచూడండి.

ఆంధ్ర, దత్త మండలాలకి డిస్ట్రిబ్యూటర్లు :

**వాహినీ పిక్చర్స్ లిమిటెడ్ :: మద్రాసు - విజయవాడ - తాడిపత్రి**



*Chandamama, September '48*

*Photo by: B. Ranganadhan*

నేను ముగ్గు వేస్తున్నా!



చందమామ అందరికీ కావాలి

చందమామ కన్నడంలోనూ
అరవంలోనూకూడా వస్తున్నది

PRINTED AT THE B. N. K. PRESS, MADRAS-1